# భారతము

## 1757 అభాగ్య పర్వం

*S. P. Rai Vyas.*



సారథీ పబ్లికేషన్స్

సారథి అండ్ కో., తెనాలి

1959



1=25

# 1757 భారతము

## అభాగ్య పర్వం

### రౌడీలరాజు క్లైవు ఇంగ్లండులో

1740 సంవత్సరము. అతిశీతల మండలమునకు చెందిన యింగ్లండు దేశములో నొక పల్లెటూరు. రాత్రిభోజనము తీరినది. ఆదినమున పనులు పూర్తియైనవి. నెగడి ప్రక్క వెచ్చగా కూర్చుండియున్నది ముసలియవ్వ. ఒడిలో పదునైదేళ్ళ బాలుడు క్లైవు కూర్చుండియున్నాడు. ప్రక్క-యింటి పిల్లలు గొంతులెత్తుకొని వచ్చియున్నారు. దూరమున తండ్రి రాతే 'మాల్కం' చుట్ట కాల్చుకొనుచు గునుకుచున్నాడు.

క్లైవునకు అవ్వయన ముద్దు, గారాబము. లేకపోయి నచో బదునైదేండ్లు వచ్చి, యెద్దువలెనున్న మనుమని నొడిలో కూర్చుండబెట్టుకొనునా? ఊః. ఆమెయే వానిని చెడుపుచున్నదనుకొన. చదువులేదు, చక్కదనము లేదు. ఉత్త సోమరిపోతు. సోమరిపోతుల యాలోచనలు దయ్యముల పనులు నొకటియే. ఉత్తపుండగీడైనాడు. అతని తండ్రి యొక చిన్న చిల్లర వర్తకుని యంగడిలో నతనిని పనికి కుదిర్చెను. అంగుల కాతజెంత బ్రతిమాలెనో, ఎన్ని పూచీలిచ్చెనో! పాపము! మాట దక్కలేదు. నాలుగు దినముల

లోనే యతను బచ్చిదొంగయని తేలిపోయెను. గల్లాపెట్టె లోని షిల్లింగులే కాక కొంత సజుకుగూడ కైంకర్యము చేసెను. ఎముకలు విరుగగొట్టి, త్రోలివేసిరి. ఇంటివద్దఱ తండ్రిగారు వేడియూచకర్రయే మఱికొన్ని వడ్డించెను. పాపము! అవ్వ మాత్రము వానిని బిలిచి, చక్కని కథలద్వారమున జెప్పినగాని నీతులు వాని తలకెక్కవని గ్రహించి, యాంత్రికముగ ప్రయత్నించసాగెను. అది వేయియు నొకటవ ప్రయత్నము. ఆమెకు విసుగులేదు. మహదానందము.

విష్ణుశర్మ పంచతంత్రకథలు విని బాగుపడుటకు క్లైవు భారతీయుడుగాడు. హితోపదేశకథలు, జాతకకథలు, దశకుమారచరిత్రకథలు, కథాసరిత్సాగరకథలు, కథాసప్తశతి కథలు, శుకసప్తతికథలు, భట్టివిక్రమార్కుల కథలు, భోజ కాళిదాసులకథలు, లలిత విస్తరకథలు, అరేబియా రాత్రుల కథలు, ఈసప్కథలు మొదలగున వన్నియూ చెప్పెను. పిదప క్రీస్తుకథలు, బైబిలు పూర్వనిబంధనకథలు చెప్పెను. అతనికే మైదవయేటినుండియో దినమునకొకటి, రెండు చొప్పున చెప్పు చుండెనేమొ—వేలకువేలయ్యెను. అగ్గిరాజుకథలు, కాశీ మజిలీకథలు, కాంటర్ బరీ కథలు కొంచెమునచ్చినట్లున్నవి.

దినమునకెన్ని కథలు జరిగినను కథకాక సంఘమునగించు చొప్పున దీసికొనిపోయి, అవ్వదగ్గఱనున్న పెట్టెలో వేసి, తాళముపెట్టున లవాటయినది క్లైవునకు. అదియు నవ్వ చేసిన యలవాటే. కథ గడదాక శ్రద్ధగా గునుకకయే వినునలవాటు

గావించుటకామె యీయుపాయము బన్నినది. నాటికవి యొకపౌనుకిమించియుండును.

సెయింట్ల కథలు, సైన్యకథలు నతని కెక్కుడు నచ్చి నట్లున్నవి. కేవలము సిగత్వముగాఅకే వీరత్వము ప్రదర్శించిన వీరగాథలు రుచించినంతగా క్రైస్తవ ధర్మవీరుల క్రూసేడ్లు రుచించలేదు. చారిత్రక వీరుల యుద్ధగాథలు, పురాణవీరుల శూరగాథలు చెప్పవారున్నచో నతడెన్ని మైళ్లు నడిచియైనను వెళ్ళివినును. బాలెటులనబడు గేయ కథలు, నృత్యకథలు నన్నచో బడిచచ్చెడివాడు. ఇంటిలో చెప్పకుండ ఎన్నిసారులో బొఱుగువారికి వినబోయినందుకై చావ, జీనుక దెబ్బలు దినిన సందర్భములు లెక్కకురావు కూడ. సినిమానాటకములకు, బొమ్మలాటలకు దండ్రిమాటలు లెక్కజేయక సబ్బందముగా బోవుచుండెడివాడు. చివాట్లని నను, తిట్లనినను మెప్పులు, దీవెనలవలె నుండెడివి. కవ్వించి కజ్జాపెట్టుకొని, తొడగొట్టి ద్వంద్వయుద్ధమునకు బిలిచి, వినోదించెడివాడు. బృందములోని వారందఱు రెండు పక్షములుగాజీలి, ఒకటి తెల్లవారనియు నొకటి నల్లవారనియు ననుకొని, కత్తులతో, కఱ్ఱలతో గొంత పోరు నటించి, యది యొక యాటగా నాడి, క్రీడించెడివారు. నల్లవారిబృందము నీగ్రోలవలె, ఎఱ్ఱ యిండియనులవలె కృత్రిమ ముఖముల దగిలించుకొని యుండెడివారు. ఆటచివఱ నల్లవారోడి, తెల్ల వారికి లొంగిపోయి, 'మానల్లవారి నుద్ధరించుకొఱకే మీ తెల్ల వారు సృష్టింపబడియున్నారు. మీరు పుట్టుకతోడనే యా

భారముతో బుట్టుచున్నారు. మాకింత నాగరకతా భిక్ష పెట్టుడు. మాయిళ్ల దీపములు బెట్టుడు. మా యాత్మల నుద్ధరించుడు.' అని మోకాళ్ళపై నిలిచి, రెండు చేతులెత్తి, దేబిరించవలెనని నియమము గలదు.

క్లైవుకు తనజన్మలోని యాంతర్యము తెలిసినట్లు తోచును. తానేదో ఘనకార్యాచరణమునకు పరమాత్మ ప్రేరణ నొందుచున్నట్లుండును. తన చేష్టలు నచ్చని తండ్రికిని విపరీతముగా, నప్రతిష్ఠాకరముగా దోచిన దోషముగాక! ఆయన తృప్తికై యాయన కొట్టినను బడియుండువాడు. చిన్నతనములో మొత్తనివాడు యౌవనములో మహాసేనానియెట్లగునోయని నిర్ణయమ్మోడిదికాదు. సంఘ మతనికి వ్యతిరేకమైనచో దానెట్లు తట్టుకొనవలయునో యభ్యాసమునకై కావలయునని యాటకాయి తనము జూపెడివాడు.

ఒకసారి తనగొప్పను జండ్రికిని, గ్రామస్థులకును బ్రదర్శింపదలచి, రహస్యముగా గొన్నియిళ్ళకు నిప్పు ముట్టించెను. గాలికా మంటలు వడసగా ననేకములకు బ్రాకెను. ప్రజలు హాహాకారములజేయుచు నోపినవఱకు పోసి నార్పకొన బ్రయత్నించు చుండిరి. ఇంతలో సిలలు చేసికొనుచు క్లైవు తన మూక నంతను దీసికొని యోగవిహారమును సల్పి, ఒకమూల నాస్తిని, పిల్లల, వృద్ధుల ప్రాణములనురక్షించుచు వేరొకచో మంటలార్పి, యందఱి ధన్యవాదములను, అభినందనములను, కృతజ్ఞతను బొందుకొనెను. కాని వాని నన్నిటిని బ్రత్యక్షముగా, బహిరంగముగా, స్వీకరించవలసివచ్చు

తూర్పిండియాసుగంధద్రవ్యముల యుపహారములనుస్వీకరించి, యవ్వకిచ్చి మొదలుపెట్టు మనెను.

ఆ దినమున నా కానుకలను జూచుసరికి నాయవ్వను భారతదేశము జ్ఞాపకమునకు వచ్చినది. ఉత్తేజముతో చెప్ప సాగినది. నేను ఊకొట్టుచుండెను.

"అనగా అనగా ఒక దేశము. దాని యిఱుగుపొరుగు దేశములే కాదే, సిపాంగోలు. కాదే అనగా జంఘీజుఖాను కథ చెప్పితినే... అతని దేశము అతని మనుమడు కుబ్లైఖాను బహుగొప్పచక్రవర్తి. అక్కడున్న చిచ్చుల పిడుగువలె, నిప్పులు గురియు సుడిగాలివలె యూరేసియాను గడ్డలతో గడారులతో నూడ్చి, పసిఫిక్కు, అట్లాంటిక్కు సముద్రజలములతో కలాపి జల్లిన తాత శౌర్యమునకుదీసిపోను. కుబ్లాయి చేతగాని సుంగులనోడించి, సైనికులను గుఱ్ఱముల మీదనే కాపురములు జేయించెను. నల్లసముద్రపు ప్రాంతపు టూనాను పాత ముఖ్యపట్టణమగు ఖాన్బాలిని బ్రహ్మాండమగు వస్తుకళాకృతులతో గలిపి, భూమూర్తికి గంటల మొలత్రాడుగట్టినట్టి. యాంగ్సీ నది పెద్దకాలువను బునరుద్ధరించి, మన్నునుండి బంగారము బండింపజేసినాడు. నవలారచన, నాటకకళ నవనవలాడించి నాడు.

మన దేశమునుండి యక్కడకుబోయి, యుద్యోగములు సంపాదించినవారిలో వెనీసియన్ వర్తకుడు నికోలోపోలో కొడుకుమార్కొపోలో యొకడు మార్కోపోలో భారతదేశమునుగూడ దర్శించి, వర్ణించియున్నాడు.

సూర్యుని పుట్టిల్లదియే. దినమునకు సగముగంటలు వెచ్చని వెలుగుండు నక్కడ. సహారాలోవలె మంటలు మండక, మన అతిశీతలమండలములోవలె మంచుతో బిగుసుకొనిపోక స్వర్గసీమవలెనుండును. మనకది పరదేశమగుటచే పరడైసుపదమును స్వర్గమునకు బర్యాయపదముగా వాడుచున్నాము. అక్కడ సర్వము సూర్యకాంతిలో దళ తళలాడుచుండును. ఎక్కడజూచినను జీవవర్ణములగు నాకాశనీలము, ఆకుపచ్చ ఏకాలము మిలమిలలాడుచుండును. మన దేశములో గోధుమ, ద్రాక్షకూడ పండని అతిచలి. అక్కడ గోధుమ, ద్రాక్ష కాక వరి, మామిడికూడ పుష్కలము. మన కమృత మెంత తెలియునో మామిడిపండురసము సంతియే కదా! మఱి యీ బెల్లపు చెఱకు కదియే పుట్టిల్లు. మనము కూర్చున్న యీ జనపనారసంచి అక్కడిదే. మనము నిత్యము నాహారములో, పానీయములలో, ఔషధములలో వాడుకొను సుగంధద్రవ్యములక్కడివే! మన యన్నియేకాదు, మన మెన్నడెఱుగని ప్రత్తి, పట్టు అక్కడ సర్వసమృద్ధి. ఇక్కడ స్త్రీలే ధరించము; అక్కడ పురుషులుకూడ ఆభరణములు ధరింతురు. అక్కడ ఆభరణములే కాదు భవనములుగూడ బంగారముతో గావించుకొందురు రత్నములు స్థాపించి."

క్లైవు 'అవ్వా, మఱి మనం అందఱము చెప్పుకొను ఎల్డొరేడో అదియే నందువా?'

'మఱేమి? అదియే! మన వెన్నిసు, జినోవా, కెయిరో

వారంద అక్కడినుండియే తెచ్చి, మనకీదినుసు లమ్ముచున్నారు.'

'ఎల్డొరేడోలో బంగారము, రత్నములు కొండలుకొండలుగా బడియుండునందురే! భారతదేశంలో నిజముగా నట్లియుండునా? మన మొక పలుగు, పార పట్టుకొనిపోయి, త్రవ్వి, తట్టలను తట్టలు తెచ్చుకొనకూడదూ?'

'వెఱ్ఱివాడా, అక్కడ మనుష్యులుగూడ ఉందురు. వారు చాల ప్రతాపవంతులుగూడ. మన అలెగ్జాండరు, సెల్యూకసు వారిదెబ్బ కొంచెము రుచిచూచియే వచ్చినారుగూడ! నాగరకత మొట్టమొదట అక్కడనే ప్రారంభించిన దందురు. మన దేశములలో మన తాతలా దినములలో నింకను గుహలలో, అడవులలో దిరుగుచుండెడివారు. గుడ్డకట్టుకొనుట యెరుగక, మాంసమును వండుకొనుటయు నెరుగని యుండెడివారు. మన కక్షరములుగూడ రాని దినములలో వారికి వేదములను మహాగ్రంథములుండెడివి. నీకు నేను చెప్పిన యీ వేల కథలన్నియు వారి కల్పనలే యనుచునే వారిగొప్ప నీ కర్థముగాగలదు. అరబ్బుల ద్వారమున వారి శాస్త్రములు వారి కళలు, వారి విజ్ఞానము నన్నియు మనకు దిగుమతి యైనవి. చివరకు మన గ్రీకు తత్త్వవేత్తల యాధ్యాత్మిక జ్ఞానముగూడ వారి యెంగిలేయందురు.'

'అదికాదవ్వా' ఎన్నడైనా నాబోటివా డందియూ వెళ్ళిన నే కలలు నిజమగును! గనిత్రవ్విన బంగారము లభించునుగాని

చవిటిపఱ్ఱ నెంత శోధించిన నేమిలాభము? మహారత్నము తో నిండియున్న అక్షయపాత్రవంటి భారతదేశం వెళ్లవలయును! భేదనీతినో, దండనీతినో చూపి, అక్కడి బంగారపు కొండలకు, రత్నగిరులకు చక్రములు దగిల్చి, గుఱ్ఱములగట్టి తోలుకొనిరావలయును! ఇక్కడనేయుండి, ఉన్నవి స్తరినే చించుకొని, యింతమంది జనులము బ్రతుకగలుగుటకష్టమే! లేకున్న మజాల నే స్పెయిను నావల మీదనో పడి, మెక్సికో నుండి కోర్టేజు యోధులాస్త్రికరాజులగొట్టి, తెచ్చుకొను చున్న బంగారమునో, పెరూనుండి పిజార్గో విజేతలినాక రాజుల పంచించి, మోసికొనివచ్చు రత్నరాసులనో తిరిగి దోచుకొనవలెను, అంతియేకదా.

"అయితే అన్నా, పోపు అధ్వర్యమున స్పెయిను, పోర్చుగలు ఉత్తరదక్షిణ అమెరికాలను పంచుకొని, దోచు కొనుచున్నట్లు కాదందువా ఇండియా?"

'అమెరికాయంత తేలికగా ఇండియాను దోచుకొనుట. వారి హిందూమతం పశ్చిమాసియా దక్షిణ అమెరికాలంతట ప్రాకిన దనగా వారివాఙ్మయం తూర్పాసియా, యూరపు, తుదకుమన బ్రిటనులోగూడ ప్రాకినదనగా మన క్రైస్తవ, మహమ్మదీయమతములింతగా ప్రబలినను వారిసంస్కృతి చెక్కు చెదఱలేదనగా వారేమియు నీవనుకొనునంత యశక్తులై యుండరు.'

'అయితే వారిని జయించుటకు వీలగు లోపములేమియు నుండవా వారిలో?'

‘ఉన్నటు లున్నవి. రెండు. సముద్రాంతర వర్తకములో నెంత యందెవేసిన చేతులైనను సముద్రయుద్ధ మంతగా జేయ లేరట. ఆధ్యాత్మికాలోచనలు, సన్యాసభావములు ప్రబలి యుండుటచే, ప్రజలు బరులను దేలికగా నమ్మి, చేరదీతురట.’

‘ఇంకేమి ? మనది భౌతికవాదమయ్యె. పంచమహా సముద్రములకు మనము చక్రవర్తులమయ్యె. లొంగిన మనకే ఇండియా లొంగితీరవలయును. మహమ్మదీయాధికారు లెవ రైననున్నను, వారుత్త విలాసపురుషులే కదా! నైసుకు, వసితకు, పరవశులే కదా! అంతే మనకు కావలసినదే నన్నమాట!’

‘అవునునాయనా. ఇప్పుడు బంగారమంత యైపోయిన తరువాత అమెరికాకు వెళ్ళినవారంత చెఱకు, ప్రత్తి, పొగాకు, జొన్న పండించుకొను చున్నారట.’

‘పైబంగారము దోచుకొనిననైపోవును. గనులలోబంగారము త్రవ్వుకొనిన నైపోవచ్చును. కాని వ్యవసాయము వలన పండించుకొనగల బంగార మైపోదు. ఇక్కడనగా వేలకువేలు పోసి పొలములు, సవరసులు బఱచి నివేశనస్థలములు సంపాదించుకొన వలసి వచ్చుచున్నది. కాని అమెరికాలో నెవ రోపినవఱకు వారడవులాక్రమించుకొని, వారు వలసతీర్చుకొనుటయేనట. కష్టపడవలె గాని కావలసినంత పొలము, స్థలమునట !’

‘అవును. అమెరికా కన్నెభూమి కావున పిచ్చిపంట పండుచున్న దట. అట్టిచో నా కేదార క్షేత్రములను ద్రవ్వి తెచ్చి, యచ్చో ప్రతిష్ఠించుకొనలేకపోయినను, మనకు గావలసిన

ముడిదినుసుల నక్కడే పండించి తెచ్చుకొని యిక్కడ మనం పరిశ్రమలైన స్థాపించుకొనవచ్చుగదా. జర్మను సముద్రములో బడవలు నడుపుకొని కష్టించి జీవించెడివారందర అక్కడకు బోయినసరి.'

'అవునవ్వా! అంతతో దీఱదు. మన పారిశ్రామికోత్పత్తికి దగిన యంగడికావలెను. ఇండియా యందుకు బనికివచ్చును. కొనుబడిదారు లెక్కువగుకొలది ఉత్పత్తి పెఱుగవలెను. దానికి యంత్రములుండవలెను. న్యూకోమేన్ ఆవిరియంత్రము నభివృద్ధిగావించి, యుపయోగించుకొనినచో గాని లాభములేదు. దానికి డబ్బుకావలెను. అది కూడ ఇండియా యీయవలెను. ఏమందువు?'

'మన కాబటు సోదరులు గనిపెట్టిన న్యూఫౌండులాండులో బంగారముకంటె విలువయగు చేపలు దొఱకుచున్నవటగా? ఇది మంచిది. ఎవరో కవియన్నట్లు దున్ననక్కరలేదు, విత్తనక్కరలేదు, నూర్చుకొనుటయే ఏకముగా. ఈ ఋతువని లేదు. ఆఋతువనిలేదు! ఈ గాలియనిలేదు, ఆ గాలియని లేదు! వర్షాభావములేదు, కాలువలక్కఱలేదు! పెట్టుబడి లేదు, పెద్దఱికములేదు! తఱుగుండదు, పెఱుగుండదు! చాల మంచి వ్యవసాయమది!'

'అందులోగూడ కష్టమున్నదవ్వా. ఏకష్టముకూడలేని వ్యాపారము బానిసవర్తకము. ఎవరో తెగువఱులైన యోడదొంగలు సముద్రములుతరియించి, ఎడారులుగమియించి, దినదినగండము వేయియేళ్ళాయుష్షుగా ప్రయత్నించి, నరభక్షకుల నుండి

తప్పించుకొని, యెట్లోపట్టుకొనివచ్చిన నీగ్రోలను చవుకగా గాని, ఎత్తుకెత్తుధనమున కమ్ముకొనుట మఱిగినారు. కష్టపడనొల్లని పోకిలాపురుషుల కండలలో కనకవర్షము కురిపియుచున్నదట హెన్రీ రాకుమారుని ధర్మమాయని, ఆఫ్రికా పశ్చిమతీరం పరిచయమైనప్పటినుండియు!'

'ఏమోనాయనా. సాటి మానవులను బానిసలవలె నమ్ముకొని జీవించుటకంటె అంతరాత్మవిరుద్ధ మింకొకటియుండదను. అట్టివారికి నరకముకంటెను బాధాకరమగు శిక్షలుండునను.' అన్నది.

క్లైవు 'అవ్వా, మనకథ ఆగిపోయినది. నా చేతిలోని గోధుమ గింజ చేతిలోనే ఉండిపోయినది.' అన్నాడు. అవ్వ తిరిగి మొదలిడినది. క్లైవు ఊకొట్టసాగెను.

"అట్టిది మన కథలోని భారతదేశం. ప్రపంచ జనాభాలో దాని జనాభా దరిదా పయిదవవంతుండును. అది పరిశ్రమలకుకూడ పుట్టినిల్లు. ఢక్కానగరపు మజ్లిన్లు ... ఏడుపొరలు జుట్టిన నొడలు గన్పించునట. వానికై మన సామ్రాజ్ఞులు, రాజ్ఞులు, జారిణులు, ఫేరోలు నెగబడి ఎత్తుకెత్తు బంగారమిచ్చికొని, గర్వముతో ధరింతురు. అక్కడి దంతపుపని, రత్నములపని, కుట్టుపని, కట్టుపని, సాలొమన్ కాలమునుండియు ప్రసిద్ధి. ఆవ్యాపారమంతయు నొక్క వెన్నిసు, జినోవా కెయిరోమాత్రమే యేల గుత్తగొనవలెనని డచ్చి (హాలెండు వారు) ఫ్రెంచి, పోర్చుగీసు, చివఱకు మన బ్రిటిషువారికి గూడ కన్నెఱ్ఱయైనది.

1453లో కాన్స్టాంటినోపుల్ పట్టణము తురుష్కుల వశ

మయినది. దక్షిణమున నీజిప్షియనులు దురుష్కులే. ఉత్త
రమున నంతయు బార్బేరియనులు. దానితో నైరోపియను
లకు నాలుగు తలుపులు మూసినట్లయినది. ముఖ్యముగా
భారతదేశమునుండివచ్చు ప్రసాదము మహమ్మదీయుల మో
చేతులనుండి జారినదప్పగత్యంతరము లేనట్లుదోచెను. ముఖ్య
ముగాఁబోర్చుగీసువారికి దలగొట్టి నట్లయ్యెను.

పోర్చుగీసులనగా నరసంచారమునకు సముద్రము హద్దు
కాదు, రాదారి యని గుర్తించిన జాతి. నారిలో జాలమం
దికి సముద్రమే స్వగృహముగా నుండెడిది. హెన్రీ రాకుమా
రునకు నావికాగ్రణి యను బిరుదుండెడిది. తుద కా బిరుదే
యాతని యింటిపే రయినదికూడ. నారికున్న నేల చాలక,
క్రొత్తనేలల గనుగొందమని కష్టినది. ముఖ్యముగా నిండి
యాకు మహమ్మదీయుల వ్యూహములోనుండిగాక స్వేచ్ఛగా
జలమార్గమున్న బాగుండునని తోచినది. హెన్రీ కేనరీ,
అజోర్ దీవులను, ఆఫ్రికా పశ్చిమ తీరము గాలించి వైచెను.
బార్తొలోం డయజు ఆఫ్రికా దక్షిణాగ్రము తుఫానుల
మయముగాదనియు, ఆశలకాదియనియు గనిపెట్టెను.

అప్పటికి భూమి గోళమని ఋజువైనది. అందుచే
పడమరగా బోయినను భారతదేశమును జేరవచ్చు ననుకొను
చుండిరి. కొలంబసను నిటాలియను స్పెయినురాణి యార్థిక
సహాయముతో బోయి, అమెరికాకు తూర్పునగల బహామా,
క్యూబాదీవులను జేరి, అవి తూర్పిండియా దీవులని భావించెను.
మానవసాహస్త్ర పంపినను కొలంబసు బంగారముగాని, సామ్రా

జ్యముగాని సంపాదించలేదని రాణి యతనిని కారాగృహమున నుంచినది పాపము ! అది 1492 లో. అమెరికాను గొలంబసు పేరుమీద బిలుచుభాగ్యముగూడ అతనికి బట్టనీయలేదు రాణి. 1507 లో వెస్పూచీ దానిని గాలించెనని, అమెరిగో విస్పూచి పేర దానిని బిలుచుచున్నారు.

వాస్కోడగామాయను పోర్చుగీసు నావికుడు దక్షిణాఫ్రికా యగ్రమునుజుట్టి, తూర్పుతీరమున మొంబాసా చేరి, యక్కడ దేశీయులకు జిక్కెను. సమయమునకక్కడకు వచ్చిన ఘూర్జర భారతీయవర్తకుడు మాలింఖనాన్న యతనిని గాపాడి, తనతో గళ్ళికోటకు దీసికొనిపోయెను. అది సా. 1498. కానిచో నాపమతని కక్కడనే సమాధి కావలసినది. గాని దానితో హిందూ మహాసముద్ర [illegible] యయ్యెను. ఆచారిత్రాత్మక సంవిధానమునకు గానుకగను స్పెయినురాజు పోపుచే 'ఇథియోపియా - అరేబియా - పర్షియా-ఇండియా సముద్రయాన, వర్తక, విజయ' సర్వాధిపత్యుడు గావింపబడెను.

పూర్వవర్తక మంతయు వెనిసు, జినోవా రేవులనుండి లిజ్బన్ కేంద్రమునకు మరలెను. అరబ్బులకును, ఈజిప్షియనులకు సుంకములరాబడి తగ్గెను. ఇటాలియనులకు లాభములు తగ్గెను. ఆకారణమున మూరులకు సుల్తానులకు దనము గల్గెను. 1500 లో బోర్చుగీసువారు బ్రెజిల్ గను గొనుటవలన వారి లక్ష్యము తూర్పునుండి కొంత పడమరకు జీలవలసివచ్చినది, పోర్చుగీసు నావికాధిపతి ఫ్రాన్సిస్కో డీ

ఆఫ్రికా భూమార్గమునకంటె సముద్రమార్గమే వర్తకమున కెక్కుడు క్షేమము, ననుకూలమునని కనిపెట్టెను. అతడు 1509 లో నెఱ్ఱసముద్ర, పర్షియా యఖాతముల ముఖద్వారముల నరికట్టి, ఈజిప్టు నావికాబలముల నోడించి, సముద్రాధిపత్యము నొందెను. ఆల్బూకర్కు 1510 లో గోవా, మలాకాలను జయించి, చీనా, జపానులవఱకు సముద్రసామ్రాజ్యమును వ్యాపింపజేసెను. గోవా రాజధాని జేసి, కళ్ళికోట నుండి కేంద్రము నక్కడకుమఱల్చి, పాశ్చాత్య వర్తకమును హస్తగతము గావించుకొని, పోర్చుగల్ రాజు ఇమాన్యుయల్ పాదముల నుంచెను.

భారతీయ లలిత కళల సంపర్కమువలన పోర్చుగీసు వారు పునర్వికాస మొందిరి.

1519లో బయలుదేఱిన పోర్చుగీసు నావికుడు మాజిలను దక్షిణఅమెరికానుజుట్టి, మొదటిసారిగా పసిఫిక్ మహాసముద్రమును దరించి, మొట్టమొదటి భూప్రదక్షిణ కర్తయనిపించుకొనెను. ఫిలిప్పైను దీవులను దమరాజు ఫిలిప్ పేర నాక్రమించి, బలియయినను అతని యనుచరులు 1522 లో నింటికి జేరి, యతని గీర్తిని జాటించిరి. పాపము 1581 లో పోర్చుగలు స్పెయినుకు లొంగినప్పుడు దాని స్వాతంత్ర్యముతోబాటు, దేశీయుల సామ్రాజ్య వైభవముగూడ కోల్పోయెను.

1584లో మన సర్ వాల్టర్ రాలేకూడ అమెరికాలో ఎల్ డొరేడోను గనుగొందమని పోయినవాడే! వర్జీనియాను

గనిపెట్టి, పొగాకు, బంగాళాదుంపలు దెచ్చెను. బంగారము గనిపెట్టలేదని ఎలిజబెతురాణి యతనిని కారాగృహమున నుంచినది. బ్రిటిష్ గయానాలో బంగారము గనిపెట్టలేదని యేకదా మన ఒకటవ జేమ్సు అతని ప్రాణముల దీసినది!

పోక నిండుగా సుస్పష్టము ఆఫ్రికా దక్షిణాగ్రమును దేలికగా జుట్టవచ్చునని, ముందొలందలు గనిపెట్టి, చాల కాలము దానిని వారి జాతీయ రహస్యముగా నుంచుకొనిరి.” అన్న దన్న.

క్లైవు, ‘అన్నా, మఱి యింతమంది నావికులు మహాసముద్రము నీది, యిన్ని క్రొత్త ఖండములు, క్రొత్త దారులు గనుగొని, నీతలు నిలువని నీటిపై నిన్నిదారులు గుర్తించిరి కదా దేనికందువు? వారి ప్రాణములపై వారికి దీపిలేదందువా?’ అనెను.

‘అవునునాయనా, అట్లాంటికుతర్వాత భూమియేయున్నదో, అఖాతమేయున్నదో తెలియని దినములలోనే కొలంబసు తెగించి, బయలుదేరినాడనగా అది విజ్ఞానతృష్ణ యనుకొందును. కొలంబసునుండి మాజిలన్ వఱకు సంతమంది యన్నివిఘ్నముల దెగించుటచేతనే నేడు మనకింత భూగోళ విజ్ఞానమున్నది. ఏమందువు?”

“అవునన్నా. అంతియే కాదు. జనాభాలు పెఱిగిపోయి, ఉన్న భూమి చాలక, బ్రతుకుదెఱువులకై క్రొత్తభూముల యన్వేషణ యొకటి, బంగారపు పిచ్చ యొకటికూడ కారణము లనుకొందును.”

"అంతేకాదు. నాయనా, ఇంకొక ఆశయము గూడ ఉన్నది. మహ్మదీయులతో మత యుద్ధములు జేసిచేసి, విసిగి పోయిన స్వమతాభిమానులు గొందఱు తాము నమ్మిన దైవమతమును ఏమతము లేని యనాగరకులలో వ్యాపింప జేయ బూనుట యది."

'అవునవ్వామణి. ఇక్కడ మన వారందరికినీ దురభిమానము హెచ్చయి పోయెను. ఒకరి మత మొక తెందుకు విశ్వ సింతురు? అందుచే వారి ప్రచారమునకు క్రొత్త దేశములు గావలసెను. అదిసరియే. ఇప్పుడిండియాలో మన యీస్టిండి యా కంపెనీ కూడ వర్తకము జేయు చున్నట్లున్నది?'
'అవును. మనము, పోర్చుగీసువారు కాక డచ్చివారు, ఫ్రెంచివారు కూడ ఉన్నారు. డచ్చివారిదృష్టి తూర్పిండియా దీవులపై నెక్కువ యున్నటులున్నది. పోర్చుగీసుల దృష్టి కొంత దక్షిణ అమెరికాపై మరలి నట్లున్నది.
'అయితే మనము, పరాసువారు ... ఇద్దఱమేనన్నమాట ఆ ఎల్-డొరేడోని ఎవరేలు కొనుటయో తేల్చుకొనవలసినది?' అనినాడు క్లైవు.

తన పడకకుర్చీలోనే యొక కునుకుదీసిన తండ్రి యులికిపడిలేచి, "ఇంకనూ కాలేదా మీకథలు, మీరు?" అనుచు దా శయనించబోయెను.

అవ్వ నామె శయ్యకుజేర్చి, క్లైవుకూడ శయనించెను. పిల్ల లెవరియిండ్లకు వారేగిరి.

* * * * * * *

నైపా రాత్రినిద్రబోలేదు. ఇండియా... తూర్పిండియా సంఘము... ఫ్రెంచివారిపోటీ... స్పైను, వనితల బానిసలగు నవాబులు... సముద్రముమీాద పనికిరానట్టియు, ప్రాపంచిక విముఖులైనట్టియు భారతీయులు... బంగారపు కొండలు ... రత్నరాసులు... కాబోవు బ్రిటన్ కర్మాగారమునకు కావల సిన పెట్టుబడి, ముడిసరకు, అంగడి! ... జర్మన్ సముద్ర నౌకలమీాద, అమెరికా వ్యవసాయ క్షేత్రములలోను, శ్రమ పడుచున్న సోదరులు... నానాటికి పెరుగుచున్న నిరుద్యోగులు తఱుగుచున్న యుద్యోగములు ... చుట్టు చవిటి దిబ్బలు, దూరమున మేరుపర్వతములు... వరుసగా కనులముందు తిఱుగు చుండెను. తరువాత చిన్న కునుకుపట్టినట్లున్నది. ఏదియొ కల... కన్నెరాణి ఎలిజబెతు నెదుట నొకచేత కడుపు, నొక చేత తలఁబట్టుకొనియున్న అన్నార్తులయిన దేశీయులు ... 1600 సంవత్సర ఫలకము ... దాని ముందు మహారాణి అభయహస్తములలో తూర్పిండియా సంఘమువారి కాజ్ఞా పత్రము... 1608 సంవత్సర ఫలకము.. దానిముందు ఎల్ డొ రేడో... బంగారపు కొండపై బంగారపు గద్దె, దానిపై జహంగీరు పాదూషా, ఆయన పాదములముందు ప్రథమ బ్రిటిష్ పౌరుడు కెప్టెన్ హాకిన్సు... 1613 సంవత్సరఫలకము ... దానిముందు తిరిగి జహంగీరు చక్రవర్తి సింహాసనము ఆయన పాదములయొద్ద మొదటిబ్రిటిష్ రాయబారి సర్ థామస్‌రో సమర్పించిన జేమ్సురాజు విజ్ఞాపన... దోసిలిలో చక్రవర్తి కరుణాప్రసాదముల ఫర్మానా... 1639 సంవత్సర

ఫలకము... దానిముందు చాల్సురాజు మిత్రశేఖను భారత చక్రవర్తి షాజహాన్ చేతికందించుచున్న కుంపిని అధ్యక్షుడు [illegible], డచ్చి, పోర్చుగీసు పోటీల ఓడదొంగలవలన సెంటు జార్జికోట, కళ్ళికోట, బందరుకోటలలోని కుంపిణీ యేజంట్లు ఫిర్యాదుల నాలించి, యభయ మొసగు పాదూషా ... 1658–1707 ఫలకముల వరుస, వానిముందు ఔరంగజీబుపాదూషా కత్తుల తెఱ, అదియెప్పుడు లేచునాయని కనిపెట్టుకొనియున్న కుంపిణీజనం... తరువాత 1739 – ఫలకము, దాని ముందు బీహారు–బెంగాలు సుబేదారు అలివర్ధిఖాను... అతని రూక్ష వీక్షణములు ... నాదిర్షా దండయాత్ర, 57 రోజుల ఢిల్లీ దోపిడి, పర్షియాకు నడచిపోయినరత్న రాసులు, కోహినూరు వజ్రము, నెమలి సింహాసనము, ... ఆఫ్గన్ వీరుడు అహ్మద్షా లూటీచేసి, కాబూలు నడిపిన కనక, రత్నములు... అన్నియు నతనికి ప్రత్యక్షమయ్యెను. అవి యన్నియు నదొక మహా ప్రవాహమువలె అతని మీదుగా ప్రవహించి, పోయినవి. అతడా వెల్లువలో తలక్రిందై, యుక్కిరిబిక్కిరియై, మునిగి, తేలి, కొట్టుకొనిపోయెను.

చివరి దృశ్యము. నాటి యింగ్లండురాజు రెండవ జార్జి తనపై నాశామయదృష్టుల బఱచుచున్నాడు. దూర మున ఫ్రాన్సు–ఫలకము దానిముందు 15 వ లూయిప్రభువు నిలిచి, మనయనంతరము మహాప్రళయము, మహావినాశము సామ్రాజ్యవాదులకు, వలస వాదులకు గీదు! వినోదింతము దురాక్రమింతము, మనదే ఎల్డొరేడో, మనకే ఆ స్వర్ణ

స్వర్గము! పోర్చుగీసులను దచ్చిని, పొంచియున్న బ్రిటిష్ వారిసి పారద్రోలుడు. ఇవిగో ఆయుధములు, ఇదిగోధనము ఇవిగో సైన్యములు, ఇవిగో యుద్ధసంభారములు' అని పంపుచున్నాడు. అక్కడ భారతభూమిలో గవర్నరు డూప్లే స్వీకరించుచున్నాడు. ...జార్జిరాజునుగని లూయీ 'నీ కర్మ ఇంతే!' అనుచున్నాడు. పాపము జార్జి తలవంచుకొని ఇటుల తనపై నాశామయదృక్కులు బఱపుచున్నాడు.

మిత్రుడు, ప్రష్యాచక్రవర్తి యగు మహాఘనుడు ఫ్రెడరికు, ప్రతికక్షి, ఆష్ట్రియా రాణి మేరియాథెరీసా యది చూచి నవ్వుచున్నారు. ఫ్రెడరికు పోలెండును నిర్జించి, యందులో థెరీసాకు భాగముబెట్టగానామె పాపము 'పాపమని, జాలి, పశ్చాత్తాపముబడి, సానుభూతి దెలుపుచునే తన వాటాకై చేయి జాచుచున్నది!

తా నుండగా తనరాజిండియాలో ఫ్రాన్సునీ, యూరపులో థెరీసానుజూచి, తలనెత్తుకొనలేక దించుకొనుటయా ?

అక్కడ భారతదేశములో మధ్యగా సగమువఱ కాక్రమించుకొని, పీష్వానాయకత్వమున మహారాష్ట్రరాజులు—బరోడాని గైక్వారు, ఇండూరుని హోల్కారు, గ్వాలియరుని సింధియా, నాగపూరును భాన్స్లే — దక్షిణమున నైజాము నుండియే కాక ఉత్తరమున నింకనూ నామమాత్రావశేషముగా మిగిలియున్న ఢిల్లీ పాదుషానుండికూడ కప్పములు కట్టించుకొనుచున్నారు ఇంకను దక్షిణముననున్న కర్ణాటక

నవాబు మొట్టినవానికెల్ల కప్పము గట్టుచు, తనకు రావలసిన పన్నులు, వసూలు జేసిపెట్టుట కెవరు దొఱకుదురాయని చూచుచున్నాడు. తూర్పున బెంగాలు — బీహారునవాబు అలివర్ధిఖాను అపర ఔరంగజీబై, విదేశీయ వర్తకుల నను మానించుచున్నాడు. అదిగో ఢిల్లీ చక్రవర్తి కిరీటము సామంతరాజులకత్తికొనలపై దిఱుగుచున్నది. "బంగారము నాకర్షించు కాంతమును గనిపెట్టి దానితో నా కిరీటమును— గారడీజేసి—లాగి, జార్జిరాజుతలపైనుంచవలయును. వాయువ్యమున నాఘనులు బల్లెముతో దాని నందుకొని పోజూచుచున్నారు. రాజపుత్రులూఱక వినోదము జూచుచున్నారు. అయోధ్యనవాబూరక గుటకలు మ్రింగుచున్నాడు. మైసూరువాడూఱక గ్రుడ్లప్పగించినాడు.

క్రైస్తవమతము సత్యమత మగుట సైతానుమతమగు మహమ్మదీయ మతమును దప్పక నిర్జించునని ప్రేరేపించిన "గ్రూసేడు" లోడినందుచే పాపము పీఠాధిపతి పోపు ఎవఱినీ ఏమియుననలేక యున్నాడు. ఎంతయైనను ఫ్రెంచివారి జాతీయత మనదానియంతబలియలేదు! పరాసురాజు లూయీ నిరంకుశుడగుట అతని ప్రజలతని పథకముల నంత యామోదించకపోవచ్చును. జాను కాలములోని ప్రజలదెబ్బ చాల్సుకాలమున జ్ఞప్తికి దెచ్చుటతో మనకుతరువాతరాజుల తాసాలు తెగినవి. జార్జిరాజు పాపము జనులనే నమ్ముకొని నాడు. అతనికి నేనేమి చేయగలను?" అనుకొనెను.

ఇంతలో కల కఱగిపోయెను. చదువులేక, పరీక్షలు లేక ఏ తరిఫీయతు లేక, ఏ యోగ్యతలేక పల్లెటూరిలో పడుచు పిల్లలముందు ప్రతాపముజూపుటానెక్కడ? పట్టపరీక్షలిచ్చి వర్తకపుపాటు తెలిసి, సైనికశిక్షణనొంది, లంచమిచ్చుటకు ధనమో, పట్టుపట్టుటకు బంధువులో, అధికారుల ప్రాపకమో ఏదియో కలిగిననే అబ్బ తూర్పిండియా కంపెనీలో నుద్యోగమెక్కడ? ... కనీసము గుమాస్తాపని దొరకినను జాలు. ముందు సముద్రములుదాటి, ఆ స్వప్నస్వర్గములో బడ వచ్చును. తరువాత కలము బారవైచి, కత్తి పట్టవచ్చు. ఎన్నియో యోగ్యతలు గలిగియు, లోకసభ యెన్నికల కై ప్రాంతమున నిలుచువారు తన్నాశ్రయించుటలేదా? "నా అదృష్టశిల్పము నా చేతిలోనే యుండును. అవకాశము లబ్బవలయునే కాని. ఈ కంపెనీలో, జగ్గువులేనివారికిగూడ ఏవియో యుద్యోగములున్నవట! టామ్ము, డిక్కు, హేరీ కూడ ఇండియా వెళ్ళివచ్చినారు. అబ్బా! కళ్లు తిరిగిపోవును. ఊరకమూటలు, మూటలు, మోసి తెచ్చుకొనుచున్నారు. వర్తకలాభములా? నౌకరులకు వాటాలుండవు. దొంగవర్తక లాభములా? కావచ్చును. మఱి తూర్పిండియాకంపెనీవారు పొందిన గుత్త ఫర్మానాలేమి? ... ఏమో! మఱి ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసు వారందఱు వేఱు వేఱు ప్రత్యేకవర్తకములు జేసికొనుటలేదా? ... ఒక వేళ దొంగ సొమ్ము కావచ్చును. దోపిడీసొమ్ము కావచ్చును. ఏదైననేమి?

చెమటలు కార్చిన నేమి? నెత్తురు చిందించిన నేమి? దేవుడు మెచ్చునిందు; దయ్యము మెచ్చునిందు. ధనము ... బంగారము ... రత్నములు ... తిండి ... గుడ్డ ... సామ్రాజ్యము ... స్వేచ్ఛావ్యాపారము ... ముడిదినుసులు ... మార్కెటు ... అవీ! అలెగ్జాండరు, డరయసు, నెపోలియను అత్తిలా, జంఘిజుఖాను ఎవరును జయించని విశాల సామ్రాజ్యము! హీనథైన ముస్లిములు, అక్బరు, ఔరంగజేబు లే పాలించిన భూలోకస్వర్గము! గజ్నీ, ఘోరీ, అహమ్మద్షా, నాదిర్షా వందతెంతదోచుకొనినను, తఱుగని ... సదా పెఱిగెడి జీవనిధి!

అమెరికా, ఆస్ట్రేలియా, ఆఫ్రికాలలోవలె ఇండియాలో దేశీయులను త్రోసి రాజని, వలసలు స్థాపించ లేకపోవచ్చును. కాని సామ్రాజ్యమునే స్థాపించవచ్చును. వలసలలో నయిన సోదరులనే మాతృదేశమును వదల్చి, తీసికొని పోవలసియుండును. కాని దేశములలో, కాని వాతావరణములలో, కాని శీతోష్ణస్థితులలో వారు శ్రమించవలసియుండును అక్కడ మనకాడి మనమే మోసికొని, కృషి చేయవలసియుండును. సామ్రాజ్యములో నట్లుకాదు. మనకాడి నన్యుల భుజములనుంచి, పండిన పంటలను మాతృదేశమునకు దోలుకొని పోవచ్చును." అనుకొనుచు నిద్రలేచెను.

* * * * * * *

ఆ రాత్రి శైవుతండ్రికిగూడ నిద్రలేదు. శైవు దుండగములు మితిమీరుచుండెను. చేపల పట్టుట, పిట్టలగొట్టుట అతని వ్యాపకములు. అవి విసుగుపుట్టినప్పుడు కోడిగ్రుడ్లను పంది

పిల్లలను జేదెబ్బగొట్టుట సాగించెను. కిటికీలయద్దముల పగుల గొట్టి, లోస యద్దములను, టాయిలెటు సఱుకులను గాఁజేయ సాగెను. చాకి జేవులలో నుతికియుంచిన దుస్తులను సంగ్రహించసాగెను. పట్టుబడినప్పుడు జీవాట్లు జెప్పుదెబ్బలు దగులవలసినది. కాని యతనికొక మూక యుండెడిది. ఆ పోకిరీ పిల్లలందరితో విరోధమువచ్చునని, పాపము! హతభాగ్యులతని తండ్రితో జెప్పుకొనుచుండిరి.

తానే స్వయముగా రక్షక భటులకు బట్టియిచ్చి, కారాగృహమున బంధింపజేసిన? లేక ప్రాణములదీసి, యెవఱు జూడకయే పాఱవేసినచో?... కనీసమేసైన్యములోనో, ఏ వలసలలోనో, ఏ సముద్రవ్యాపారుల సేవలోనో జేర్చి, పంపి వేసిన?— పీడవదలిపోవునని యనుకొనుచు నివతలకు వచ్చెను. రాబర్టు (క్లైవు) ఎదుఱువచ్చి, తూర్పిండియా సంఘమువారి క్రింద తన్నొక గుమాస్తాగానో, సేవకునిగానో, చేర్పించ వలసినదిగా ప్రార్థించెను. ఇద్దఱి యుద్దేశ్యములు గలిసెను.

* * * * * * *

అనుకొన్న దానికంటె తేలికగా రాబర్టు తూర్పిండియా సంఘవ్యాపారుల క్రింద సేవకుఁగుదిరెను. ఇండియా దూరము గొంచెము, గించెముగాదు. 6000 మైళ్లు నేలమీదగాక సముద్రముపై నారునెలలుపోక, 6 నెలలురాక. అక్కడనా– ఎండలుతీవ్రము. ప్రజలు క్రొత్తవారు. వింతయాచారములు. అట్టి ఇండియాకుబోయి, వచ్చుటయనగా మట్టిలోజేరి వచ్చుటవంటిదనియు, నిండియాలో నేడు వందలు ఇంగ్లండు

లో నేడు పౌనులనియు కొందఱి విశ్వాసము. అందువలన అట్టి సేవ గోరెడివారు తక్కువ. అందును, గుమాస్తా పనికి చాకిరీపనికి గుదిరెడివారు మఱియు దక్కువ. అట్టి పనినే క్లైవు కోరుట, అతని తండ్రియు నొడబడి, వ్రాసి యిచ్చుట, అంతియేకాక అతనికొక పార్లమెంటు సభ్యుని సిఫార్సుకూడ కలిగెను. ఆయన పక్షమున నెన్నికలప్పుడు రాబర్టు తన మూకతో గూడ ప్రచారముజేసి యుండినందుల కది కృతజ్ఞత.

* * * * * * *

ఓడనెక్కుచు, దనకు వీడ్కోలొసగవచ్చిన బంధుమిత్ర, పరివారముతో "పార్లమెంటు సభ్యుడుగా, లార్డు క్లైవుగా ఇంగ్లండులో పునర్దర్శనము! కానిచో స్వర్గములో దేవుని యొద్ద" అని అతని చివఱిమాట.

## గుమస్తా - సేనాపతి

రాబర్టుక్లైవు మదరాసు 'ఈస్టిండియా కంపెనీ లో స్టోర్సు గుమాస్తాగా బ్రవేశించినాడు. ధరించినది నూలు చొక్కాయైనను శరీరమునకది బిగుతుగా బట్టి యుండుటచే కండలు దీరిన యతని బొమ్మ కోటులోనుండికూడ ముందునకు బొడుచుకొనివచ్చినది. మోటుతనము వెలిజిమ్మ నతని వాలకమతడు సైనికుడుగా బనికివచ్చుననిపించుచున్నది. కాడీ తన మాయుధముగా, వర్తకము వ్యూహముగా—యుద్ధం జేయకయే — భారతదేశమును మాట్టడించి, ఆక్రమించు

గ్రొంగ్రొత్త విధానమొకదాని నతడు రూపొందించుచున్నాడు. తా నింగ్లండులో నలవఱచుకొన్న భేదనీతి, దండనీతి బ్రయోగించుట కదనెప్పుడాయని చూచుచున్నాడు.

గుమాస్తాగిరిపై నతనికి లక్ష్యములేదు. ఏదో విప్లవాత్మకమగు నుద్దేశ్యమున్నటులున్నది. లేనిచో నతనికి కంపెనీ పాతరికార్డులజోలి దేనికి? సెంటుజార్జికోటలో జేరి యతడు సేయు బరిశోధన మేమియో? ఒక సామ్రాజ్యనిర్మాతకు వలసిన పట్టుదలతో బరిశీలించుచున్నాడు.

'బలే. బలేమంచిపత్రము. అబ్బా! ఎప్పుడో 1616 లోనే పుట్టించినాడు మా తామస్ రో. ఏమిటీ? కుంపిణీ వారు తమ నౌకర్లపై తామే చర్యలు జరుపుకొనవచ్చుననియా? ఇది ఉండవలసినదియే. దీని నాధారము గావించుకొనియే కాబోలు పోర్చుగీసులను, ఒలందలను, పరాసువారినిగూడ ఓడదొంగలనియో, నాత్మీయులనియో పేరుబెట్టి శిక్షించుచున్నారు!... ఈఫర్మానా నిచ్చిన పాదుషా శుద్ధ లోకజ్ఞాన శూన్యుడు. ఆయన మనుమలు నందులో నతనికి దీసిపోరు. విజాతీయులే! వారికి దామిచ్చిన యధికారము నెంతవఱకు సద్వినియోగము నెంతవరకు దుర్వినియోగము జేయుచున్నారని చూచుకొనవద్దు? ... ఇప్పుడు కాలముగూడ మాఱినది. ఈయధికారమునే యింక తమ ప్రజలపైననే చూపినను ఊఱకుందురు! చెల్లిపోగలదు!...

'ఫ్రెంచివారిని జూచి కదా మనవారును భారతముపై సామ్రాజ్యోద్దేశ్యము లుంచుకొనినది? ... అట్టిదో —

వారు 1665 లోనే భారతీయులను సిపాయిలుగా జేర్చుకొని పాశ్చాత్య విధానములో శిక్షణ నిచ్చుచున్నారుకదా — మనము వారిని కేవలము కాపలాకు. ఊళిగమునకు మాత్ర ముంచుకొనుచున్నామే?... ఎక్కడివారినక్కడ సైన్యములో జేర్చుకొని, వాడుకొనవలయునే కాని అందఱినీ సీమనుండియే దిగుమతి జేసికొనవలెనంటే యెట్లు? ... నమ్మకము గుదుఱు వఱకు నాగుటయా?... ఈతవచ్చువఱకు నీట దిగరాదన్న టులున్నది... ఎక్కువ జీతము, సౌకర్యము లిచ్చినసరి తేలికగా వీరజాతుల నాకర్షించవచ్చు. కేవలము తెల్లమొగ ములు వేసికొని, మనమే దండెత్తి, యేరాజ్యముపై బడినను దేలికగా దొఱకిపోదుము. ఎంత అశిక్షితులయినవారు గూడ తమకొంప, కోడె సంరక్షణకై కావున మూక—యుమ్మడిగా వెడలబడి, నక్కలగుంపును, తోడేళ్ళ గుంపును దఱుమున ట్లు తఱుమగలరు. భారతీయసైనికులను ముందుంచు కొని నచో, నది గొడ్డళ్ళకు గట్టిపిళ్ళు వేసికొనునట్లే యగును. కట్టెలతోగాక చెట్లుగొట్టలేముగదా! మఱియొకటి. దేశీయ సైనికులకుగూడ మన యుషప్పులే మన యాయుధములేయు న్నచో నచ్చము మనవలెనే యుండగలరు. అధిపతి మన వాడైనచో దేశీయసైన్యములతోడనే దేశీయుల జయించ నచ్చును. ఇంకొకటి. వీరి ద్వారమున దేశీయులలో ననే కులు క్విస్లింగు (ద్రోహు) ల సంపాదించుకొన వచ్చును. ముఖ్యముగా మన విజాతీయతను, విభిన్నతను వ్రేలుబెట్టి,

చూపించుకొనక యుండుటకై యిది కొంత యుపయోగించ గలదు. కావలసినప్పుడందఱము గలిసిపోయి చరించవచ్చును.

'అసలు మావారికి వర్తకోద్దేశ్యములుగాక రాజకీయోద్దేశ్యములు మొదటినుండియు లేవు. ప్రభువులు పంపుదుమన్న రాజకీయోద్యోగి తమ కక్కఱలేదని యెప్పటినుండియో యనుచున్నారుకదా ... తోటి పరాసువారు రాజకీయోద్దేశ్యము లుంచుకొనునప్పుడు మనము నట్లుంచుకొనినచో? పరాయివారుగానే యుండి పోదుము. ఎవరికి బనికిరానిచోట్లనే వ్యాపారము జేసికొన వలసివచ్చును. డూప్లేసేనాని దేశీయ సామంతకన్య నొకతెను వివాహముగూడ యాడినాడట! దక్షిణ భారతములో పరాసు వర్తకులు సుంకములుగూడ కట్టనక్కఱలేకపోయిన బోవచ్చును. ఇంతదూరమువచ్చి, యీ మెలకువలేకున్నచో మనకు తోటి పరాసువారిచే టొక్కుపెట్టించుకొని, చిప్పజేత బట్టుకొని పోవలసివచ్చును!

'బాగున్నది. ఈ ఎత్తుతో నాపనికూడ తీరిపోగలదు. బొంబాయి, కలకత్తా, మదరాసు, పటాలములు మూడింటికి 'నేకమాత్ర' సర్వసైన్యాధ్యక్షుడగు మేజర్ స్ప్రింగర్‌కు టొక్కుపెట్టవచ్చును.

'పాపము! పోర్చుగీసువారికి వర్తకముకంటె ఏమియు నక్కఱలేదు! తూర్పు సముద్ర వర్తకమునకై వారికి గోవా, అవీ—రెండుమూడు స్థావరములున్న చాలుగాబోలు. వారి దృష్టియంతయు బ్రెజిల్‌పైనే యున్నట్లున్నది! డచ్చివారి

దృష్టియంతయు దూర్పిండియా దీవులపైకి మరలుచున్నట్లున్నది! మనకు వారి యడ్డమేయుండదు! ఏల, వాల, ఒక్క పరాసువారే! రాజకీయముగా వారిప్పుడే బలపడుచున్నారు. పరాసువర్తకు లందువలననే స్వదేశములో స్వజనులలోవలె స్వేచ్ఛావర్తకము జేసికొనగల్గుచున్నారు.

'దీనికొకటే యుపాయము. రాజకీయబలము లేనిదే వర్తక సౌకర్యములుండవని నమ్మజెప్పియు, కేవల వర్తక లాభములకంటె సామ్రాజ్య భాగములనుండివచ్చు రెవిన్యూ యేమంత తక్కువకాదని వాదించియు కంపెనీపాలకుల నొప్పించవలయును. అమెరికాలోవలె నిండియాలో సంపాదించగల సామ్రాజ్యమునకై యింటినుండి పంపవలసిన ధనమేమి యుండదనియు, పైపెచ్చు జాతీయఋణవిముక్తికై సామ్రాజ్యమునుండియే ధన మెంతయో యుండగలదనియు, ఫ్రెంచి వారితో సమానముగానైన సైన్యములను మాత్రము బంపవలసియుండుననియు రాజును పార్లమెంటును, ఒప్పించవలసి యుండును'! అనుకొనుచున్నాడు.

ఇంతలో 1680 సంవత్సరపు సంఘువార్షికనివేదిక యగుపించినది. ఔరంగజేబు చక్రవర్తి తమవారు దేశాక్రమణోద్దేశ్యమున నున్నట్లు గుర్తించి, ప్రకటించి, సూరతునుండి పారద్రోలి, బొంబాయి ముట్టడించి, విశాఖపట్టణము మొదలగు చోట్లగల సంఘకర్మాగారములను స్వాధీనపరచుకొనుటయు, కాళ్ళు, వేళ్ళు బడి యాశ్రయించగా క్షమించి పుచ్చుటయు దెలిసి నవ్వుకొనినాడు, 'వర్తకపు గిడ్డంగులు

సామ్రాజ్యదుర్గములు కోటలుగా, కౌశలాదళములు సామ్రా-
జ్యసేనలుగా, ఆత్మరక్షకాయుధములు దురాక్రమణోప కర-
ణములుగా మారుదురని భయపడినాడు. పాపము! ఈ నా
డట్లనుమానము గూడ పడువారు లేరు. ఉన్నను నిరోధించ
గలవారు లేరు.

'1685 లో చిటగాంగు దండయాత్రను గూర్చిన
నివేదికయాయిది?... ఛీ! తొందరపడినారు. బహిరంగమైన
మనవారి దురాక్రమణోద్దేశ్య మానాడట్లు విఫలమగుటయే
మేలైనది! అది నిజముగ జయప్రదమై యుండినచో నాటి
హిందూస్థానపు రాజులందఱికి హెచ్చరికయయ్యెడిది. అప్ర
మత్తులై యుండి, ద్రోహము ఋజువైనప్పుడింటిదాక కుక్కల
గొట్టినట్లుకొట్టి, తఱిమెడివారు. ఐక్యత కవసరము గుర్తించి
యుండెడివారు. వారి పిట్ట పిట్ట పోరు తీర్చుటకై పొంచి
యున్న మనపిల్లిసంగతి గుర్తింపబడెడిది!... నిజముగా మహా
రాష్ట్రులుగాని అయోధ్య, బెంగాలునవాబులుగాని మన
యాంతర్యమును గుర్తించి యున్నచో దెలిసెడిదిపని!

'ఔరంగజేబు మనుమడు అజీంషా బెంగాలుకు సుబే
దారుగా నున్నప్పుడు మనవారి కాయన యిచ్చిన జాగీరుల
ఫర్మానా!... ఏమిటి? గోవిందపురం, కలకత్తా చోటిపట్టి...
అయితే విలియం కోట, కట్టిన తావు పాదుషా యినామన్న
మాట! సూరత్, బొంబే, అహమ్మదాబాదు, కల్లికోట,
మచిలీబందరు జహంగీరు పాదుషా యినాములా! మఱి విశా
ఖపట్టణం, మదరాసు? స్థానిక నవాబుల యినాములై యుం

టవి. సరే, బొంబాయి? ఛార్లెసు రాజును బురిడీవేసి, కాజేసినది ... బాగున్నది చరిత్ర... అడిగి తీసికొన్నవి కొన్ని, అరువుగా, కవులుగా దీసికొన్నవికొన్ని! నొంగిలించినవి, దురాక్రమించినవికూడ కొన్ని యుండవచ్చును. సూదికి జోటడిగి దబ్బనం దట్టించుకొంటూ వచ్చితిమి. ఏకై చేరి, మేకై తేలితిమి. నపుంసకత్వముచేకాక, కర్మాగారములకై యొసగిన తావులలో కోటలు కట్టుకొనుచుండగా, జూచియుజూడనట్లు, వినియు విననట్లు, తెలిసియు దెలియనట్లూఅక యుందురా? ఇంక దక్కన్ నైజాము, అయోధ్య వజీరు, బంగాళానవాబు, — తామే ... స్వాతంత్ర్యమును ప్రకటించుకొనినప్పుడు మనల నేమని తప్పనగలరు? పైపెచ్చువారి స్వాతంత్ర్యమును గుర్తించి, వారికి వంగివంగి సలాములు జేయుచుంటి మయ్యో! ఎగుమతి, దిగుమతి సుంకములు వారికేకట్టుచూ వారిరాజ్యాదాయముల బెంచుచుంటిమాయె! కోరరు కాని ససైన్యముగా వారియండను దూకుదుమయ్యో! వారికింక కావలసినదేమి?'

* * * * * * *

## అభాగ్యయోగము

పాశ్చాత్య సైనికులు — ఫ్రెంచివారు కాని, ఇంగ్లీషువారు కాని, ఎవరైనను—యూనీఫారం ధరించి, తుపాకి పట్టుకొని, లెఫ్ట్, రైట్, కదనుతో ప్రచారము జేయుచున్నప్పుడుగాని, నిర్నిమేషముగా నిలబడియున్నప్పుడుగాని దేశీయులకు

భీతి గొల్పుచుండెడివారు. ఎట్టిగా జేవ్వరించిన వారి దధసుఖములు; మోమాటము, సానుభూతి, దయ, దాక్షిణ్యము, మెత్తదనము నేమియు నెకోశమునలేని వారి ప్రవర్తన, నిర్లోభము, నిష్కామమునై, జాతిగర్వముతో, ఆధిక్యమనస్కంతో గర్వ, మాత్సర్యములతో దొణికిసలాడువారి ధోరణి దేశీయ రాజులయు, పూంజీపతులయు, ధన స్వాములయు, సాహుకార్లయు, బేంకర్లయు లక్ష్యము నాకర్షించెడివి. ధనాగార రక్షణకు, ద్వారపాలనకు వారినెన్నుకొనినచో సింహములను పర్పములనుగాపుంచుకొనినంత ధైర్యముగా నుండెడిది.

దినములు మారినవి. జహంగీర్లు, షాజహాన్లు, ఔరంగజేబులు, శివాజీలు భారతదేశమును పాలించు దినములలో నాంగ్లరాజులగు జేమ్సులు, చాల్సులు, దమబిడ్డలను వారి పాదములయొద్దకుబంపి, పరదేశి భీకరులగు నా ప్రభువులదయా ధర్మముల నాహరించి, వారిముంగిళ్ళనేవో పచారిదినుసులు ఉప్పు, సారా లమ్ముకొని బ్రతుకనిండని పరిపరి విధముల వేడుకొన్న దినములేగినవి. ఇతరయూరపియన్ పోటీ వ్యాపారస్తులబారినుండియు, ఓడదొంగల బాధనుండియు నమ్ము రక్షించవలసినదని, దేశీయ ప్రభువుల ప్రాధేయపడిన దినములు గతించినవి. తిన్నయింటి వాసములు లెక్కిడక క్రైస్తవేతరముగా ప్రవర్తించి, పట్టుబడిన పట్టులలో నా ప్రభువుల చేతనే చావచితుక దెబ్బలుతిని, చెంపలువేసికొని, అపరాధములు చెల్లించి, సత్ప్రవర్తనకు బూచీలిచ్చి, క్షమింపబడిన

దినములు గతించినవి. మగ బిఱుదులుగల యూపాగపాలు, ఛత్రపతులు, నవాబులు, రాజులు గతించిరి.

కాలము మాఱసాగినది. ఆ ప్రభువుల పాదరక్షల దుఃసవనుగూడ యోగ్యులుగాని వారి పుత్రులు, పౌత్రులు వారిస్థానముల దీసికొనుటయు, నా విజాతి యాశ్రితులకు భారతదేశపుసిరు బాగుగా నొంటబట్టిపోవుటయు దటస్థించుచున్నది. మగఁడు ముండాయనిన ముష్టికి వచ్చిన వాడు గూడ ముండా యనును. దేశీయ సామంతులు స్వతంత్రించసాగినప్పుడు బరదేశములనుండి బ్రతుకవచ్చినవారు హద్దులు మీఱి, ఉచ్ఛృంఖలులు గాఁజొచ్చిన నాశ్చర్యమేమి?

రాజుల కాలములోనే యువ రాజులు దిగ్విజయ మొనర్చి, యౌవరాజ్యాభిషేక కాలమున సామంతులచే నడుగులకు మడుగులొత్తించుకొనసాగినచో వారి రాజరికములో వారి కింక ఎదురెట్లుండును? ఔరంగజీబు, శివాజీలతో ఆ కాలమేగినది. మాఱిన కాలములో వారి తాతతండ్రులకు జెడబుట్టిన ఆనాటి యేలికలేమంత కష్టపడలేరు. బాధ్యత లక్కఱలేదు. పదవులు కావలెను.

ఉత్తరమున ఢిల్లీలోనొక కాలు, దక్షిణమున నౌరంగాబాదులో నొక కాలునుంచి, తూర్పున కలకత్తా వఱకొక చేయి పడమట కైబరు కందహారుల వఱకొక చేయి చాచి, నిర్నిమేషియై సర్వభారతమున కేకచ్ఛత్రము బఱచి, నిలిచిన ఔరంగజేబు చక్రవర్తి ఖురాను ప్రతులు వ్రాసికొని, పుల్లె-టోపీలు కుట్టుకొని, ఆకలి దీర్చుకొనెడివాడు! నాటి

అతని మనుమలకు పట్టిపోయిన ఆలంఘీరు బిరుదుచాలు. సామంతులను ముకుద్రాల్లువేసి, మేలు శక్తి పోయినది. వారంతటవారు సలాములుజేసిన గ్రహింతురు. నజరానాల జెల్లించిన స్వీకరింతురు. ఆ నజరానాలే కప్పములనుకొని వారు స్వీకరింతురు, పాపములో పాలుగా వీరు ప్రసాదింతురు. తమతో దమవంశస్థులకు బాదుషాగిరీ గతించిననేమి? తమ ప్రజల నెవరెంత పీడించిన మాత్రమేమి? ఏదియో పేరున నేదినమున కాదనము తమ త్రాగుడుకు, తరుణులకు వలసినది జల్సా—మహాల్‌లలోనికే, కన్ను తెఱచుసరికి వచ్చి రాసి పడినసరి. అంతకుమించి వారిజీవితములకు ఘనాశయములు లేవు.

కాలాను క్రమమున గఱిగిపోసాగిన భారతీయ సర్వ సామ్రాజ్యమును దేశకాల పాత్రానుగుణముగ మాఱు పేరుతో బునఃప్రతిష్ఠ గావించిన శివాజీ తన భారత పద పాదుషాహీం సర్వస్వమును రామదాసస్వామికి సమర్పించి, యా యోగిరాజుకు బ్రతినిధియై రాజకార్యమునె ఆపిన రాజయోగి యైనాడు. కాలముమారుటతో ఆయన వారసు లాయన పేరు జెప్పుకొని, ప్రవర్తిల్లుచున్నారు. వారి కొక బృహత్సామ్రాజ్య నిర్మాణమునకు వలసిన యైక్యత గాని, ముందుచూపుకాని లేవు. ఇటుగు పొటుగు దేశీయ రాజులను సామంతుల గావించుకొనిరే కాని చాపక్రింద నీరు వలె నెక్కి—వచ్చుచున్న విజాతీయ ప్రాబల్యమును నిరోధించి. తఱిమివేయవలసిన యవసరమును వారు గుర్తించనే లేక

పోయిరి. బహుశః మహమ్మదీయులవలె క్షీర నీర న్యాయముగా గలిసిపోవచ్చిరే కాని తైల నీర న్యాయమున వేరుండి నెత్తి నెక్కరాలేదని యెంచి యుందురు.

* * * * * * *

## కొని తెచ్చుకొన్న కొఱవి

పూర్వము సముద్రతీరమున నొక వృద్ధమానిసి యుండెడివాడట. అతడు నరులను దిను బిశాచ జాతివాడయ్యు వృద్ధుడగుట నశక్తుడయ్యెను. అందుచే నతడు నడువలేని కుంటివానివలె నటించుచు ద్రోవబోవు బ్రతివానిని దన్నల్లంత దూరము దీసికొనిపోయి విడువ బ్రార్థించెడివాడు. ఏ దయార్ద్ర హృదయుడో జాలిబడి యతనిని భుజముల నెక్కించుకొనెనా—అంతియే. అతడింక దిగెడివాడు కాడు మఱికొంచెము దూరము, మఱికొంచెముదూరమని, త్రిప్పి త్రిప్పి మెల్లగా దన తొడలమధ్య నతని మెడ నిఱికించుకొని నులిమిచంపి, భక్షించెడివాడు.

సరిగా బ్రిటిష్‌వాడు పై పిశాచవృద్ధుని వలెనే దాపరించినాడు. త్రోవనున్న కొఱవిని గోరి తెచ్చుకొనినట్లు 1749 లో దంజావూరు సంస్థానము బ్రిటిష్‌వారితో మొట్టమొదటగా సంబంధము బెట్టుకొనినది. ఏడేళ్ళ క్రింద ప్రతాపసింహునిచే బదవీభ్రష్టుడైన సాహూరాజు తిఱిగి రాజుగాదలచి బ్రిటిష్ సైన్యములం దోడడిగెను.

అంతసికేకాదు. ఆదినములలో ప్రతి భారతీయరాజునకు గ్రమశిక్షణలో నధిగమించు పాశ్చాత్య సైన్యము నేయి తోళ్ళు తెలుచుకొని, రెండువేల హస్తములతో నాగేష మూస్త్రములు ధరించి మీదపడు సేకమూర్త బ్రహ్మ రక్షస్సువలె గోచరించుచుండెడిది. పాపము! దధిముఖుల వోడ్పెటున్న విజయము దథ్యమనుకొనుచుండెడివారందఱు.

సమయమునకై పొంచియున్న బ్రిటిష్‌వారు నిండు హృదయముతో సాహూ ఆహ్వానము నంగీకరించిరి కూడ. ప్రతిఫలముగా దమకు దేవకోటజాగీరిమ్మని బేరము గూడ బెట్టిరి. కాని యీ యుద్ధములో దమమిత్రుడు సాహూతో పాటు బ్రిటిష్‌సైన్యముగూడ దెబ్బతిని యోడిపోయెను.

బ్రిటిష్‌వారికి కావలసినది దేవకోట సంస్థానము. అది సాహూ యీయలేక పోయిన ప్రతాపసింహుడే యీయ గలడు. మొదటి దెబ్బలో సాహూ సహకరించెను. రెండవ సారి సాహూ అవసరమే లేకపోయెను. వెలుపల దిఱుగుజోగి సాహూను రాచుకొన్న నేమైనది? బూడిదరాలినది. ఈ సారి స్థానబలమున్న ప్రతాపునితోడనే బేరముసాగించిరి. ఆ బేరము గుదురుటతో బ్రిటిష్‌వారి రొట్టె నేతిలో బడినది. వారికి భారతరాజ్యము దిగమ్రింగుటలో దేవకోట మొదటి ముద్దయైనది. చెమటగాక నెత్తురుగార్చినను వారికది స్వార్జితము. అడుగుకొన్నది, అఱువు తీసికొన్నది కాదు. దోపిడీ! పట్టపగలు దోపిడీ! లేకపోయిన సాహూ, ప్రతాపుల కిద్దఱికిని వ్యవహారము జేసిపెట్టెదమని చెప్పి, అందులో గెలిచినవారి

యొద్ద గా జేసిన రుసుము! ప్రపంచ చరిత్రలోనే అపూర్వము!

* * * * * * *

ఆంగ్లేయులైనను, పరాసువారైనను పాశ్చాత్యులు, శాస్త్రీయ యుద్ధ క్రమశిక్షణ నెఱిగినవారే కదా. అందుచే నిద్దఱు విరోధులగు రాజులలో నొకఱువీరినిఒకఱువారినిదోడుగోరెడి వారు. ఆవిధముగానావిజాతికుంపట్లను రెంటినిగోరి తెచ్చుకొని; నెత్తుల బెట్టుకొన్నది కర్ణాటకరాజ్య సింహాసన వారసత్వమునకై తగాదాపడుచున్న మహ్మదలీ, చందాసాహెబులు.

లెబార్డినీ సేనాని 1746 లో మదరాసును బట్టుకొని, ఫ్రెంచివారి యాధిక్యతను ప్రకాశింపజేసినందులకై యతని గని యోర్వలేకపోయిన గవర్నరు డూప్లే యతనిని ఫ్రాన్సుకు బంపివైచి, యాకీర్తినంత దానే యాహరించెను. పాపము చందాసాహెబు డూప్లే నాశ్రయించెను మహ్మదలీ బ్రిటిష్ వారి నాశ్రయించవలసి వచ్చెను. కర్ణాటక రాజధాని యార్కాటు నగరము ఆయాబోతుల పోరాటములో నలిగి, తెగ చేతులు మాఱసాగెను. అటు చందాసాహెబు కోడిని డూప్లే బలపఱచినప్పుడు ఇటు మహ్మదలీ పుంజును దాము బలపఱచి తీరవలయునని సలహా నిచ్చుట చేతనే రాబర్టు క్లైవు జాతకము తిఱిగి పోయినది. కంపెనీ వారతడు గుమాస్తాపనికంటె సేనాపతి పనికెక్కువ తగియుండునని గుర్తించగలిగిరి. యూరపులో లూయీ క్రింద ఫ్రాన్సు ఇంగ్లండుపై యుద్ధము ప్రకటించిన దినములవి. అటు యూరపులో వారి పుంజులు రంగప్రవేశ మొనర్చినప్పు డిటు భరతభూమిలోగూడ దిగితీర

వలెను. ఇక్కడ వెనుకాడినచో నక్కడయూరపులో నుత్సాహము దగ్గుట యట్లుంచి, తూర్పిండియా సంఘమువారు త్రాసు, గల్లా పట్టుకొని, ఫ్రెంచివారిచే కొక్కు పెట్టించుకొన యింటిసుఖము పట్టవలసియుండునని వాదించెను. ఫ్రెంచి వారు భారతీయ సైనికులకు శిక్షణనిచ్చి, భారతీయరాజులతో బ్రాపకము సంపాదించుకొని, ప్రాకిసచ్చుచున్నప్పుడు తామూరక చూచుచు నుండుట ప్రమాదమనియు ననెను. ఫ్రెంచివారి కింటినుండి సైనికాధికారులు దిగుచున్నప్పుడు తమకు గూడ సరిసమానముగా దించవలెననెను. జాగీర్లు, ఈనాములువచ్చు నవకాశమున్నప్పుడు శిరిరా మోకాలొడుట తగదని కూడ హెచ్చరించెను. కలిసివచ్చినచో జాగీరులేమి, సామ్రాజ్యమే నిర్మించవచ్చునని యాశబెట్టెను. భారతరాజ్యము ఖండఖండములై పోయినదనియు, దలకొకటి తన్నుకొని పోవుచున్నారనియు, ఫ్రెంచివారితో సమానముగా నొడిపట్టనిచో వెట్టిమొగములు వేయవలసి వచ్చుటే కాక పిచ్చివారివలె లోకులచే రాళ్లు వేయించుకొనవలసివచ్చుననియు ఘంటాపథముగా జెప్పెను.

కర్ణాటక వ్యవహారమటుండగా బెంగాలులో నొకలప్ప దొఱకునవకాశమున్నదనియు, వెనుక 1749 లో ఆర్మీనియను వర్తకుల మాటవిని, తమ్ము జావగొట్టి, తమ కాశింబజారు కర్మాగారమును, వానిని బట్టుకొని, చివఱకు 12 లక్షల రూపాయల నష్టపరిహారము దీసికొని వదలిన అపర ఔరంగజేబు అలివర్దీఖాను మరణించుటచే నతని తరువాత

(నవాబు) సుబేదారయిన సూరజ్ ఉద్దౌలా చిన్నవాడు, అనుభవశూన్యుడు, నయనీతి రహితుడు ననియు దెలిపెను.

దానితో రాబర్టుక్లైవు మేజరు స్ట్రింగర్‌కు లెఫ్టినెంటుగా గలిగెను. క్లైవు ప్రభ హెచ్చుచుండుటతో డూప్లే ప్రభకూడ మకమకలాడజొచ్చినది. మదరాసు గవర్నరే కాక బొంబాయి, బెంగాలు గవర్నర్లుకూడ క్లైవు సలహాలను మన్నించుచుండిరి.

## శంఖు స్థాపన పథకము

బ్రిటిష్ జాతి స్వాతంత్ర్య ప్రియజాతి. నైతికాంతఃకరణ కలది. బర్కు, ఫాక్సు, ఫ్రాన్సిసు, మిల్లు, కాబ్డెన్, బెంటింకు, అట్లీ మొదలగు వారి నాజాతికి సామూహి కాంతరాత్మ యనవచ్చును.

బుద్ధుడు, క్రీస్తు వంటివారెవరోతప్ప సైతాను ప్రాబల్యమునకు వశులుగాక యుండలేరు. అట్టిచో నాత్మయొక్క ఆస్తిక్యముననే విశ్వాసము లేనియూ జాతికి ఆధ్యాత్మికత చిహ్నము గాజాలదు.

అంతరాత్మ చెప్పు పరాకుల కింద్రియము లెల్లప్పుడు విధేయములై యుండవుకదా ఎంతటి రాజర్షికైనను? ఇంద్రియములేకదా వ్యక్తిని గోతిలోనికి ద్రోయునది? అట్టిచో సామూహికాత్మయగు జాతికూడ యొక్కొక వ్యక్తిమూలకముగా నప్రతిష్ఠపాలగుచుండును. క్లైవు, వారన్ హేస్టింగ్సు బ్రిటిష్ జాతి కింద్రియతుల్యులుగా జెడ బుట్టిన వారన

వచ్చును. గాజీద లున్నచో బరువులు వేయువారుండురు. మీర్జాఫరు లున్నప్పుడు క్లైవు లెందుకుండరు?

* * * * * * *

మదరాసులో నున్న రాబర్టుక్లైవు కలకత్తా పోవలెను. ఇక్కడ కర్ణాటక వ్యవహారములలో నతని యాశయముల కనుకూలించెడి పరిస్థితు లేమంత లేవు. అక్కడ బెంగాలు, బీహారు, ఒరిస్సా ప్రాంతమంతకు నేకమాత్రపునవాబు చిన్న వాడు, క్రొత్తవాడు, చేసినచో బ్రిటిష్ సామ్రాజ్య శంకు స్థాపన నక్కడే చేయవచ్చునని యతని యూహ. కేవల వర్తకలాభములు కేవల దైవికములు, నదృష్టములు అవి యయినను శ్రమకు సమముగా సంబంధించి యుండును. కాని రాజ్యాదాయము లట్లుకాదు. భారత దేశములోని మేరువులు, రత్న రాసులు రాజాగారములలో నుండును. వానిని దొంగిలించవలెను, దోచుకొనవలయును, లేక దురాక్రమించ వలెను. న్యాయమగు వర్తకము ద్వారమున నవియన్నియు నొడిలోనికి నడచిరావు. శతాబ్దులు దిజీగినను వర్తకతూకము దమవంకకు మ్రొగ్గకున్నది. పై పెచ్చు ఇండియానుండి దినుసుల ప్రవాహమేకాని అంతకుమించి యిండియాలోనికే ధన ప్రవాహము సాగుచున్నది. దేశము పొట్టకు, బట్టకు గూడ ఋణము జేయవలసివచ్చుచున్నది. అమెరికాలో, ఇండియాలో ఖాతా లెంతవఱకని యిత్తురు? దీనియంతకు నొక్కటే తరణోపాయము. దేశము ప్రకృతిసిద్ధ పదార్థములలో సంత

భాగ్యవంతముగానప్పుడు పారిశ్రామికముగా పురోగమింపు టొక్కటేమార్గము!

దేశమును ప్రపంచమునకే కర్మాగారము గావించి నచో ప్రపంచమంతయు దానికి మార్కెట్ కాగలదు అప్పుడు ప్రపంచములోని భాగ్యప్రవాహము లన్నియు నకే ప్రవహింపసాగును.

పారిశ్రామికాభివృద్ధి కింగ్లండు చాల తగియున్నది. ధనము. బొగ్గు సమృద్ధి. సన్నిహితములు. శీతోష్ణస్థితి కాయకష్టమున కనుకూలము. న్యూకోమెన్ ఆవిరి యంత్ర మును కనిపెట్టుకొని కూర్చొనియున్నాడు. హార్‌గ్రీవ్సు, ఆర్కురైట్, కే, కార్టురైట్ ఎందరో అనేకయంత్రములు కని పెట్టుకొనియున్నారు. వర్‌స్లీ—మాంచెస్టర్ కాలువకు ప్లాను వేసికొనియున్నారు. అన్నియు నున్నవి. ఒక్కటే లేదు. ధనము పెట్టుబడి: మాట నొక్కనాడు లేదు.

దేనికైన—యంత్రస్థాపనలకు వలయు ధనమునకుగాని, అవినడుచుటకు వలయు ముడిపదార్థములకుగాని, సిద్ధమైన వస్తువులను వినియోగము జేయు సంగళ్ళకుగాని—సామ్రాజ్య ము కావలెను. అమెరికాలో వలె మాతృదేశమును ఏ మాత్రము బిండకయే బంగారమును బిండగల సామ్రాజ్య మిండియాలోనే లభించవచ్చును. ప్రెంచివారి కేమాత్రము నంతు బెట్టక మొత్తము గా జేయవలెను.

అదీ క్లైవు ఆలోచన. అతనికి దగిన సహచరులు గూడ దొఅకిరి. వాళ్లు అతనికి కాబోవు నాంతరంగిక

కార్యదర్శి. వారన్ హేస్టింగ్సు కలకత్తా విలియంకోటలో గుమాస్తా, 40 రూపాయిలజీతం. అతని కనుయాయులైవై, యతనినే ముమ్మూర్తుల నాదర్శము గావించుకొని, భవిష్యత్తులో నతని తరువాత నతని పునాదులపై నతని పథకము ననుసరించి సామ్రాజ్యసౌధనిర్మాణము గొనసాగించవలసిన వాడు. హాల్వెల్ 'బోగస్' చరిత్రకారుడు. అసంబద్ధములు, నబద్ధములునగు కల్పనలను జరిత్రపేరుతో బ్రకాశింపజేయుటకై క్లైవు చేతనే నియోగింపబడిన పుండాకోరు. గవర్నరు డ్రేకు, వాట్సు, వాట్సన్ కూడ అతని యమానుష పథకము క్రింద పనివాండ్రే.

సూరజుద్దౌలా నవాబైనప్పుడు అతనికి 15,560 రూపాయలు నజరానా పెట్టిరి. భట్రాజులవలె ముఖస్తోత్రముల జేసిరి. వంగివంగి సలాములు జేసిరి. అదేదియు క్లైవుకిష్టములేదు. ఇచ్చుటకంటె పుచ్చుకొనుటయే యతనికిష్టము. ఎంత నావాబులయిన నేమి? మూరు జాతి నలుపుల యెదుట దలవంచుటన్న నతనికి గిట్టదు.

ఒకటిని దీసిపారవేయువలె ననగా ముందతనిని కుక్కక్రింద కట్టిన సరి యని యతని తెలివి. హాల్వెలు కప్పగించినాడు సూరజుద్దౌలాను జూ--కొట్టుపని. వైద్యుడు మరణించెనన్నప్పుడు రోగి తాబ్రతికియేయుంటినని యాక్రోదించినను శవముక్రింద లెక్కయట యింగ్లీషువారిలో. అట్లే చరిత్రకారుడన్న హాల్వెలుచే జెప్పించిన యెడల సూరజుద్దౌలా ఓర్పు, వివేకము, శాంతము, లేనివాడగునని తలంపు కాబోలు

అక్కడ యూరప్‌లో ఫ్రాన్సుకు, ఇంగ్లండుకు యుద్ధము సాగుచుండుటచే నిక్కడ ఇండియాలో సిబ్బంది యేసందర్భమున నెట్లు సంచరింపవలసినదియు వీరికే వదల బడెను. ఈ సందు జూచుకొని క్లైవొక ఆట ఆడదలచెను. సూరజుద్దౌలా నెట్లయినా గిల్లి, కజ్జా పెట్టుకొనవలెను. అతనికి కోపము దెప్పించి, యెట్లయిన నతడు విలియంకోటను ముట్ట డించునట్లు చేయవలెను. ఆ ముట్టడిలో గలుగు నష్టమును గోరంతలు గొండంతలుగావించి, యూరూర చాటింపు జేయించవలెను. హాల్వెలుచే బోగసు—చరిత్ర వ్రాయించి, సూరజుద్దౌలా నన్యాయపరుడగు రాక్షసునివలెను, తాము న్యాయము జరిగిన యమాయికపరదేశులుగాను బ్రచారము గావించవలెను. తమకు జరిగినదన్న యవమానపయన్యాయ ములుముందు నవాబు నేమిచేసినను దప్పుగా దనిపించవలెను. అదీ క్లైవు పథకములో నొక భాగము.

తరువాత ఫ్రెంచివారిని సూరజుద్దౌలా మీదకు, సూరజుద్దౌలాను ఫ్రెంచివారి మీదకు నుసిగొలిపి, సుందోప సుందుల వలె నిద్దఱు నీల్గిన తరువాత ఫలితములు జూడ వలెను. ఒకే యెత్తుతో రెండులక్ష్యములు సాధింపబడును. ఇటు సామ్రాజ్య సంపాదన, అటు శత్రుభంజనము.

* * * * * * *

పథకమాచరణలో బెట్టబడినది. అంతయు జాలవరకు కనుకొనినట్లే జరిగినది. నిర్భాగ్యుడు సూరజుద్దౌలా సరిగా వచ్చి క్లైవుతీయించిన గోతిలో దల్రతిందులుగా బడిపోయెను.

నిజముగా ననుభవమొక గొప్ప యంతర్దృష్టి. చిన్నవాడగుట యతనికది లోపించినది పాపము!

గవర్నరు నవాబు ననుమతి బొందకయే విలియం కోటను బాగుచేయించి, బలపఱుపసాగెను. అతనికి సహాయపడి, తమపైకి రాకుండ చంద్రనగరు, హుగ్లీల యందున్న ఫ్రెంచివారితో నిరాక్రమణ (మిత్ర) సంధి రాయబారములు జఱుపసాగెను.

నవాబు రాజ్యాంగములోని యుద్యోగులందఱకును లంచములు దీసికొనుట నేర్పి, వారికిప్పించుచు బైటపట్టము గొట్టుటయే యుద్యోగముగాగల యొకనికి అతని కార్యస్థానముతోసహా తమ విలియం కోటలో నాశ్రయమిప్పించెను ఆశ్రయమేకాదు రక్షణయు. ప్రోత్సాహముగూడ. వారికిగల గుండె యెక్కడిదో నవాబున కర్థముగాలేదు. అదిజాత్యహంకారము, ఆత్మాభిజాత్యము, రాజ్యాపహరణ దుర్బుద్ధి, దురాక్రమణాశయొక్క చిహ్నమని తెలియదు.

ఏమని నవాబడిగిన దానికి ప్రత్యుత్తరముగా గవర్నరు డ్రేకు తల తిఱుగుడుగా మాట్లాడుటయేకాక కండకావరమున నతని దూత నవమానపఱచి పంపెను. పరదేశముల నుండివచ్చి, తమ తాతతండ్రులయనుగ్రహములు, మెప్పులు బొంది. తమవాడల వర్తకము జేసికొని బ్రతుకుచు, తమ సానుభూతి, పరోపకారబుద్ధి కారణములుగా నింతత్రాడు, బంగరము సంపాదించుకొనిన విజాతీయులకు వారికేయంత యొడలు బలిసినప్పుడు పేరునకు సుబేదారయినను పూర్వ భారతమునకు బాదుషా తుల్యుడయిన సూరజుద్దౌలా కెంత

యభిమానముండవలయును? ఆ ధిక్కారమునే యతడు యుద్ధప్రకటనగా భావించునని తెలిపి, 30 మే, 1756 న స సైన్యముగా దాడి వెడలి త్రోవలో కాశింబజారులోని వారి కోటను బట్టుకొనెను. దానితో వారి పీచమడగెను. సింహ కిశోరము సిన్నదికదాయని కాలుద్రవ్విన నూఱుకొనదుకదా అట్లే జరిగినది. ఎవ్వాఱి నేమియుననలేదు గవర్నరువాట్సు, వారన్ హేస్టింగ్సు మొదలగు ముఖ్య నాయకులనుమాత్రము బట్టుకొని కలకత్తా వెళ్ళెను. అక్కడవారు తమ పథకపుటం చనాలననుసరించి యతడు వచ్చునని, యెదురుచూచుచునే యుండిరి. జూన్ 17 నుండి జూన్ 20వఱకు గొంత పోరాటము నటించిహాల్వెలు మొదలగు నాయకులు లొంగుబాటు దెలిపిరి. అంతకు ముందే గవర్నరు ద్రేకు నాయకత్వమున ప్రాణము లపై దీపి యున్నవారందఱు నోడలపై బాఱిపోయిరి. కాని వారిలోగూడ గుండెయదటునగొందఱు, తిండిలేక కొందఱు, అంటువ్యాధివలన గొందఱు మరణించిరి.

20 తారీఖు రాత్రియే సూరజుద్దౌలా హాల్వెలు మొద లగు ఖైదీలను విడిచిపుచ్చి, కోట స్వాధీనము జేసికొని, యక్కడ తన ప్రతినిధులనుంచి, వెడలిపోయెను. అదియే యతని పొఱపాటయినది. అందఱునాయకులు సేజిక్కినప్పుడు వారినందఱిని ముందు సత్ప్రవర్తనకు హామీగా నుంచుకొన వలసినది. ఆయన యుదారబుద్ధి, క్షమాశక్తి యాయన కొంప దీసినవి. నుంబ గో బసి మాసిపోవుచున్న విష సర్ప మును దప్పించిన మంచివాని సంగతి యేమైనదో యాయన ననికూడ యదే యైనది.

హాల్వెలు—చరిత్రకారుడని యందఱనుకొను నా కథ—గాదు—ఆరాత్రికి రాత్రి యొక కథనల్లివైచి, దానికి జరిత్ర యని పేరిడి, భారతమునసేకాక యూరప్‌లోగూడ చాటిం ప్రగావించెను. కత్తిపోటు, గుండుదెబ్బ యేమియు లేక కేవలం గుండె యదటున, ఆకలిపాటున, అంటువ్యాధికి తప్ప ! తాగి మఱణించిరన్న వారి శవములొక 123 అగుపించిన వతనికి. వానిని జూడగానే యతనికి భావములు ధారగా గలిగినవి. కల్పనా చాతుర్యము ప్రవాహముగా బొర్లిపోయినది. రసము వెల్లువయైనది. ప్రకృతిలో నపూర్వ మయిన భీభత్సరస తని నావేశించినది. తోడనే రాబర్టుక్లైవును దలచుకొని ఆర్గల్ పైరు—లోయగ్రామములో నొక రాత్రికిరాత్రి నొక యాంగ్లమంత్రి కల్పించిన రక్త తటాక నిర్మాణగాధ నుండి కొంత యావేశము దెచ్చుకొని, కలమును జేమునోనో నెత్తు నోముంచి, గబగబ బఱికివైచెను.

ఆ కోటలో 18 అడుగుల చదరమును, రెండు చిన్న కిటికీలును గలిగిన యొక గదిని జూపి, దానిలో (జచ్చిన వారు 123, తమ నాయకులు 23) మొత్తము 146 మందిని సూరజుద్దౌలా బంధించెననియు, దెల్లవారుసరికి దాము 23 మాత్రము గొనయూపిరితో బ్రతికితిమనియు బుట్టించెను దున్నపోతీనినదన్న దూడనుగట్టివేయించు మను స్వభావము ప్రజలది. ఇదిగో తోకయన్న నదిగోపులియందురు, లోకులు గాకులుగూడ. లోకమునోరుమూయుట యెవరికిని సాధ్యము గాదు. ఆనోట నానోట నది యెల్లెడ వ్యాపించి, చరిత్రగా ప్రసిద్ధియైనదికూడ.

ఆనాడెవఋను దాని విశ్వసనీయతను గూర్చికాని, సత్యాసత్యతలను గూర్చికాని వితర్కించియుండరు.

146 మందిని 3:4 చ. అ. భూవైశాల్యముగలగదిలో గూరుట యెట్లు సాధ్యము? ఎటుచూచినను 20 అంగుళముల మందమునకు తక్కువయుండని సైనికులే! అట్టివారందఱినీ నిలబడుడని, బలాత్కారముగా నంటద్రోసినను 116 కు మించి పట్టరే! మిగిలిన 30 మంది నెందుద్రోసినట్లు? తలుపు లెట్లు బంధించినట్లు? అందఱు బట్టిరిపో! 23రు మాత్రమెట్లు మిగుల గలిగిరి? మిగిలిరిపోండి, అందఱు నాయకులు, నధికారులు యెట్లుమిగిలినట్లు? అందరు నధకారులు, నాయకులునే మిగిలిరి పోండి. వారిని గూడ నల్లుల రాచి చంపినట్లు చంపివేయక వదలువాడా? లోకములోనికి బోయి తన యమానుష కృత్యమును జాటించనిచ్చెడివాడా? హాల్వెలును దన కళంకచరిత్ర వ్రాయునని మిగిల్చెడివాడా?

హాల్వెలు రచించిన చరిత్రలోనైనను సూరజుద్దౌలా కాశింబజారు విజయములోగాని, అంతకుబూర్వ మేవిజయములోగాని, తరువాత ఎప్పుడైనగాని. ఖైదీల నట్లు చంపించిన యుదాహరణలులేవే! పైపెచ్చందఱిని క్షమించి విడిచి పుచ్చినట్లే సాక్ష్యములున్నవే! నిజముగా నది చారిత్రక సత్యమేమైన దానిని సహించి, అదను దొఱకినంతనే ప్రతికృతి సలుపకయూగి, కొన్నినాళ్లతని పాదరక్షల నాకుటల కలిగినది?

* * * * * * *

ఇంకేమి! పథకమంతయు ననుకొనిన రీతినే సాగినది. క్లైవు సైన్యాధిపత్యమున అడ్మిరల్ వాట్సను వెంటరా భూసైన్యములు, నౌకాసైన్యములు కలకత్తా చేరుటకు కారణము పొసగినది. డిసెంబరు 20 న ఫుల్టా చేరి, అక్కడ చేరిన కాందిసీకులను గలుపుకొని, 1757 సంవత్సరం జనవరి రెండవ తేదీన కలకత్తాకోట స్వాధీనము జేసికొనిరి. అంత తేలికగా కోట బ్రిటిష్ వారికి తిరిగి వశమగుటకు కారకుడు నవాబు మేనత్త మగడు, నవాబు సైన్యములలో భక్షీ (జీతముల బంచిపెట్టునధికారి), స్వార్థపరుడునగు మీర్ మహామద్ జాఫియర్ ఖాను. అతడే దేశద్రోహి మీర్జాఫరుగా జరిత్ర ప్రసిద్ధుడైనాడు.

ముందు తాను మాతృదేశస్వాతంత్ర్యమును బరదేశీయుల కమ్మబోవుటకది నాంది. ఆనాటి మీర్జాఫర్ స్వార్థచర్య రాబోవు నొకటిరెండు శతాబ్దముల పర్యంతము దేశమాతకు సంకెళ్ళు గూర్చబోవుచున్నదని తెలిసినచో నతడా సాహసము జేసెడివాడో కాదో చెప్పలేము. తానానాడు స్నేహము జేయబోవు పరదేశీయులు దమతో సుఖములు, గష్టములు ననుభవించుటకై కలిసిపోవచ్చినవారు కారనియు, నెడముగనే యుండి, ఏలయినంతవఱకు బిండుకొనిపోయి, యింటబోసికొనవచ్చిన వారనియు దోచియుండదు పాపము! క్లైవుచేతులలో దాను స్వయముగా నుంచిన సామ్రాజ్యభాగ్యము నతనియింటికి మోసిపెట్టుటకే కాక క్లైవు దుర్వ్యశములో పెద్దపాలు శాశ్వతముగా మోయుటకును బనికివచ్చిన గాడిద

గా మాత్రము ఇతనిగూర్చి వారి చరిత్రకారులు వ్రాసి యున్నారు.

ఆనాటి సంధిలో (9 ఫిబ్రవరి) నింగ్లీషువారికి బూర్వ వర్తక సౌకర్యములన్నియు దిరిగి లభించినవి. జరిగిన కాలములో వారికి గల్గిన నష్టమునకు బరిహారము లభించినది. కోటను బలపఱచుకొనుటకుగూడ స్వాతంత్ర్యము లభించినది.

అనాడా సంధి యసలు కావలసినదికాదు. అలివర్ది ఖాను అన్నకొడుకు, పాదుషా మన్ననల నొందినవాడు, ప్రజాభిమానము గలవాడునగు సూరజ్-ఉ-దౌలాబలమును బూర్తిగా దఱుగజేసి, తన బలమును బెంచుకొనుటకు, ప్రజానాయకులలో నధికారులలో దనబలుకుబడి సంపాదించు కొనుటకు, ఢిల్లీ పాదుషా యామోదమును గొనుటకు నింక ననేకకార్యములకు మీర్జాఫరుకు వ్యవధి కావలసివచ్చెను. బ్రిటిష్‌వారికినీజరిగినదానిని దేశీయులుగాని, తమప్రతిస్పర్థులగు బరాసువారుకాని, నవాబు నతని మంత్రులుగాని, పాదూషా కాని, కంపెనీ యధికారులుగాని ఎంతవఱకు హర్షించుచు న్నారో తెలిసికొని, తరువాత కార్యక్రమము నిర్ణయించు కొనుటకు గొంత వ్యవధి తప్పక కావలెను. అందుచే నప్పటి కొక తాత్కాలికసంధి యవసరమయ్యెను.

మీర్జాఫరుతో నొకమూల గుట్రలు బన్నుచు, రెండవమూల ఫ్రెంచివారికిని, నవాబునకును జెడగొట్టు ప్రయత్నములు సాగించెను. ఫ్రెంచివారు తమతో నిరాక్రమణ సంధి జేసికొనినను దమకును నవాబునకును యుద్ధము

బాసగినప్పటికి వారు బరదేశములు దమపక్షముకంటె తమ
కాశ్రయుడగు నవాబుపక్షమునే యెంచుకొనవచ్చును.
అదికాక మే 7 నుండి యూరపులో నింగ్లండునకు ఫ్రాన్సునకు
దీర్ఘకాలిక యుద్ధమొకటి జరుగుచుండెను. సూరాజుద్దౌలా
నిష్కారణముగా ఫ్రెంచివారి నేమియు ననడు. అట్లయిన
సూరాజ్‌కు, ఫ్రెంచివారికి జెడగొట్టు టెట్లు?

ఒక్కటే యుపాయము. సూరాజును రేపి, రెచ్చగొట్టి
వీలయిన నతనిని ఫ్రెంచివారిపై కుపిగొల్పి, చోద్యము జూడ
వలయును. లేదా అతని నొప్పించి, యతనిబేరుమీదుగా
దాడియైనబోయి, ఫ్రెంచివారున్న చంద్రనగరమును దాక
వలెను. చివరకు మొదటిది సాధ్యముగాలేదు. కాని యొక
విధముగా రెండవది కుదిరినది.

బిటిష్‌వారే చంద్రనగరమును ముట్టడించి, సర్వ
నాశనము జేసిరి. నవాబంతకన్న జేయునదిలేక కాంది
శీకులకు గొంత యాశ్రయమొసగెను. క్లైవు కదికూడ
కంటుగా దోచెను.

* * * * * * *

మీర్జాఫరు తన కార్యము దా జేయుచునేయుండెను.
అధికారులలో, మంత్రులలో, నాయకులలో దన పక్షము
నకు గొందఱి ద్రిప్పుకొని, వారిచే తన గొప్పతనమును,
సూరజుద్దౌలా పనికిరాని తనమును జాటింపు జేయించు
కొనుచు గ్రమక్రమముగా గొంత పలుకుబడియు, దాన, బేధ
నీతులతో గొందఱి సహకారమును సంపాదించసాగెను.

నవాబు నదలగొట్టి, సైన్యాధిపతియై, సైనికులలో గూడ నగ మునకు నగము గట్టుకొనెను.

ముర్షిదాబాదు, సూరజుద్దౌలా రాజధాని. నందున్న జగత్సేటు, కలకత్తాలో వ్యాపారము జేయుచున్న ఓమిచందు పెద్ద బ్యాంకర్లు. పూంజీపతులు. జగత్సేటు సాక్షాత్తు ఢిల్లీ పాదుషాకే పెట్టుబడి పెట్టుచు, నతనిపై నెంతయో పలుకుబడి కలిగిన ధనస్వామి. మీర్జాఫరును బాదుషా నవాబుగా నామోదించుటకును, సూరజుద్దౌలాపై నతనికి గల యభిమానమును దొలగించుటకును జగత్సేటు పాదుషాయెడ దనకు గల పలుకుబడి నంతయు నుపయోగించుట కొప్పుకొనెను.

ఓమిచందుకు సూరజుద్దౌలాయొద్ద పలుకుబడి హెచ్చు. ఓమిచందు కీకుట్ర యెట్లు తెలిసినదో కాని కలుగగల లబ్ధిలో దన కెక్కుడువంతు గట్టబెట్టిననే కాని తానూరకుండననియు, లేనిచో నంతయు బైటబెట్టెదననియు బెదిరింపసాగెను. జగత్సేటును దృష్టి పఱుపవలసినవంతు మీర్జాఫరు గైన, నోమిచందుకు దనలబ్ధిలో భాగము బెట్టవలసెనని క్లైవు గునిసెను. కాదన్నచో నసలుపనియే చెడిపోవునుగదా! అందుకైయొక పెద్ద పన్నుగడ పన్నెను.

భారతీయుల కంతకు బూర్వము ఫోర్జరీయన్న దెలియదనవచ్చును. ఒడంబడికలను రిజిష్టరు చేయుటయే యెఱుగని జాతికి ఫోర్జరీ యెట్లు తెలియును?

క్లైవు రెండుపత్రముల నింగ్లీషులో సిద్ధపఱచెను. కటి తెల్లకాగితము. ఒకటి ఎఱ్ఱ కాగితము. ఒకదానిలో నోమిచందు కోఱిన షరతు నుదాహరించెను. రెండవదానిలో (ఓమిచందు కిచ్చెడు దానిలో) నాషరతులేదు. ఈమోసము దెలిసిన వాట్సను దొర వానిలో సంతకములు బెట్టుటకు నిరాకరించెను. క్లైవు మాటలాడక రెంటిలోను వాట్సను సంతకముల దానే ఫోర్జరీజేసివైచెను. పాపము! సంబర పడుచు సహాకరించెను ఓమిచందు వారి పాపకార్యములో.

*  *  *  *  *  *  *

సర్వము సిద్ధమైనది క్లైవు మీర్జాఫరును నవాబు గావించుటకును, మీర్జాఫరు క్లైవును, అతని వర్గమును-బూర్తిగా దృప్తిబఱచుటకు నొడంబడిక జరిగెను.

క్లైవు సైన్యముతో జూన్ 13 న దాడి వెడలి, 19 న కట్వా గ్రామము జేరుట, మీర్జాఫరు నవాబు సైన్యములో సగము జీల్చుకొనివచ్చి, యతనితో జేరుట పథకములోని ప్రథమ కార్యక్రమము. తరువాత కార్యక్రమము సందర్భోచితముగా క్లైవుచే నిర్ణయింపబడును.

ఫిబ్రవరి 9 నుండి జూను 13 వఱకుగల మధ్యకాలము నాలుగు నెలల నాలుగు దినములును క్లైవు, మీర్జాఫరు చాల చాకచక్యముగా బ్రవర్తించిరి. క్లైవు నలుబది సార్లు యిన నవాబును సందర్శించి, ముఖస్తోత్రములతో, బహుమతులతో రంజింపజేసి, ఫ్రెంచివారిని గూర్చి యూయనను బెట్టిన చీకాకులు మఱచునట్లు ప్రయత్నించి యుండును.

మీర్జాఫరు, నతని యాంతరంగికులు నెవఱో యొకఱు తీయకుండ సూరజును బరివేష్టించి, యితరు లతనితో నాంతరంగికముగా గలియకుండ, అతని కెట్టియనుమానము గలుగకుండ, జూచుచుండిరి.

*  *  *  *  *  *  *

1757 సంవత్సరము జూను 13 తేదీ సూరజుద్దౌలా తన రాజధానిపైకి బ్రిటిష్ సేనలు దండెత్తివచ్చుచున్నవను నకస్మాద్దుర్వార్త విని, యదటిపడి నిద్రమంచముసుండి లేచెను. మీర్జాఫర్ కొఱకు చూడగా నతడెందుండెను? సేనలదీసికొని, తఱలివెళ్ళెనని యెవఱో చెప్పిరి

సూరజుద్దౌలా కాశ్చర్యము గలిగెను. అతని కా విషయ మెప్పుడు దేలినట్లు? అతడు సేనల నెప్పుడు గూర్చుకొనినట్లు? అంతవఱకు దన యొద్దనే యుండెనే! తనతో మాటవఱుసకైన ననలేదే! ...తన యాజ్ఞ దీసికొనక, తనతో నాలోచించనైనా నాలోచించక యతడెట్లుపోయియుండును? అంతయు మాయగా దోచినది భయము గొల్పినది. ధీరుడు గనుక విశ్వాసనీయులగు నుపసేనాపతులబిలిచి యాలోచించెను వారికా విషయమప్పుడే తెలిసినదట. తమతమ సైన్యభాగములను వీలయినంత వేగముగా సమకూర్చుకొని, బయలు దేఱిరి. సాహుత్తు సూరజుద్దౌలాయే దానిని నడిపించుకొని పోయెను.

22 న సూరజ్ ప్లాసీతోటకు వెళ్ళునప్పటి కప్పటికప్పుడే యక్కడ మీర్జాఫర్ చేఱియుండెను. ప్లాసీలో దమ

సైన్యములు 35 వేల కాల్బలము 15 వేల యశ్వదళము, 40 ఫిరంగులతో కొండకోనలయెడ గండకములలో దాచి తుప్రై, బలిసి కాచిరి. నవాబు రాగానే మీర్జాఫర్ వచ్చి సలాము జేసి, తా నంతయు సిద్ధము జేసితినని మనవి జేసెను జూను 23 తేదీ. క్లైవు కట్వాయొద్దనాగి యక్కడ మీర్జాఫరు చారునివలన నాదంత మెఱిగి యతని సంకేతము ననుసరించి ప్లాసీ తోపుకు సైన్యము నడుపుకొని చేరెను. అతని సైన్యములో 1000 మంది యూరోపియనులు 2100 దేశీయ సైనికులు నుండిరి రాత్రి 12 గంటలయినది.

మీర్జాఫర్ ఆజ్ఞయైనది. ప్లాసీకందకములలో నున్న సైనికులు ఫిరంగులు ప్రేల్చిరి. శత్రువును భయపెట్టుటకో? లేక క్లైవు నాహ్వానించుటకో? — కొందఱు సైనికులు నవాబున కనుకూలముగానే యుద్ధము జేయసాగిరి. కాని సగమునకు సగము వేఱుపడి, ముందుకు సాగి మీర్జాఫరు ననుసరించిరి. సూరజుద్దౌలా కేమియు నర్థముకాలేదు, కాగడాల వెలుగులోనే కొంచెమస్పష్టముగా నగుపించినది. మీర్జాఫరు క్లైవును 'పుష్పమాలాలంకృతు' గావించినట్లున్నాడు. ఇద్దఱు కౌగలించుకొనినట్లున్నారు. క్లైవు తనమాలనే తీసి మీర్జాఫరుని ధరింపజేసినట్లున్నాడు. — 'ఆంగ్లసేనాపతి కల్నల్ క్లైవుకు జై!' 'సుబేదార్ సాహిబ్ మీర్ మహ్మద్ జాఫియర్ ఖాం బహాదూర్ — జిందాబాద్!' అను నినాదములు, జయఘోషములు వినవచ్చినవి. — అవి నినాదములుగావు — నవాబు

గుర్రడెక్కధ్వానిన ఫిరంగులు ... జయధ్వానములు గావు ... సూరజ్ తలపై వర్షించిన పిడుగులు ! ... ఇంతలో 'యూనియన్ జాక్ జిందాబాద్! సూరజుద్దౌలా ముర్దాబాద్!' అని తిరిగి కేకలు... అది క్లైవుగొంతువలె నున్నది! ... తిరిగి 'ఢిల్లీ పాదుషాకు జై!' అను శబ్దము... అది మీర్జాఫర్ కంఠస్వరమువలెనున్నది. "లాంగ్ లివ్ ఆంగ్లో... ఇండియన్ అలయన్స్" అని క్లైవు వాక్యం ... హిప్ – హిప్ –హుర్రే అని జయధ్వానములు!

సూరజ్–ఉద్దౌలా కోడలు మండిపోయినది. పండ్లు పటపట కొరుకుకొని 'నమక్ హరామ్ హరామ్‌జాదా! దుష్మన్–ఇ– ములక్' అని తిట్టెను.

'సుబేదారీ కావలయునన్న ఈయకపోయెడివాడనా! ద్రోహబుద్ధి దేనికి?... ఈ ద్రోహము పసివాడగు మేనల్లునెడ పెద్దవాడయ్యు దేశదృష్టిలో కొన్-కిప్పాయగు మీర్జాఫర్ వ్యక్తి చేసినది మాత్రము కాజాలదు. ఇద్దరికినే కాక ముక్కోటి భారతీయులకును మాననీయయు నస్ఖలిత స్వాతంత్ర్యయునగు భరతమాత నెడ తను చేయగల యేపనికైనను బెద్ద ప్రాధాన్యతయే కాక స్థానములోనున్న యూమె ప్రియ పుత్రుడొకడు చేసినది కాగలదు.... చూచి, చూచి, పరదేశి జాగిలమును దెచ్చి, పక్కలో బరుండబెట్టుకొన్నాడు! తన గృహమును గాపుగాయునో లేక వరుసగా నందఱిని–తనతో గలిపి–చీల్చిపెట్టునో? ...

'ఇంతపట్టుకు వచ్చునని యీవట్టుకు దెలియకుంటిని. ఇప్పుడింక చేయగలుగునది—చేరినవట్టుకు దేశభక్తుల ద్రోవ్ు చేసికొని, ఓపిన వట్టుకు బోరాడి, ప్రాణములర్పించుటయే!' అనుకొనెను. దూరమున క్లైవు, మీర్జాఫరుల జంట శంఖ ములు వినిపించినవి.

* * * * * * *

# ద్రోహమూల్యము

క్లైవు మాట చూడుడు. హిందెన్ల వైనమూ (భార తీయులు) మరణములు 500 మాత్రమేనట! తమ పక్షమున మృతులు 22 గాత్రక్షతులు 50 యైనను వారిలో నధిక సంఖ్యాకులు శ్లైలకులేనట.

ఎంత తేలికగా మాటాడెను? నాటి తను భారతాంత రంగ ప్రదేశ దినోత్సవమును, మీర్జాఫర్ విజయోత్సవ పట్టాభిషేక మహోత్సవములను బురస్కరించుకొని, ఆనాడు మీర్జాఫర్ గావించిన విందునకై యతడు కోయించిన గోవు లను, కోళ్ళను గూర్చి యనుకొనినంత తేలికగా అనివేస నామాట! నలుపులు నలుపులని నల్లజీవములను (మేకలు, గేదెలు) గూర్చి మాంసాహారులు సెప్పుకొనునంత తేలి కగా భారతీయ మానవులను గూర్చి చెప్పసాగెను కనీస రక్తపాతముతో రాజులతలలు మార్చగలిగితినని యహం భావము! అమరబోవు సామ్రాజ్యసౌధమునకు భారతముశ

జోటు చేసితివని, జూలై 26 న లండన్‌లోని ఈమకంపెనీ డైరెక్టర్ల రహస్యసంఘమునకు వ్రాసికొనెను. వారందఱు పెద్ద యుత్సవము జేసికొనిరట. క్లైవు విజయోత్సవ నివేదిక ప్రతులు, క్లైవు చిత్రపటములు లక్షలకు లక్షలమ్ముడు వోయినవట. క్లైవు (జన్మదిన) జయంతిని జాతీయదినముగా బండుగ జేసికొనిరట. అమెరికా చేయిజారిపోవుదినములలో ఇండియాను సంపాదించిపెటగల వీరుడని కీర్తించిరట. దేశోద్ధారకుడనిపొగడిరట. స్వదేశమునుండి వీరులనుగాని, ధనముగాని కోఱక, నష్టపెట్టక మహాసామ్రాజ్యమును సంపాదించి పెట్టగల వాడని పొగడిరట. ఆసూర్యాస్తమిత ఆంగ్ల సామ్రాజ్యస్థాపనాచార్య బిఱుదుతో సత్కరింతుము రమ్మని కొందఱు లోకసభసభ్యు లాహ్వానముగూడ పంపిరట.

మీర్జాఫరు రాక, సూరజుద్దౌలాపోక, ఆమధ్యకాలములో నరాజకమై, తమకు దక్కక యేమైన ధనరాసుల నెవరైన దోచుకొని పోదురేమోయని కాబోలు ముందు వాట్సు, వాల్షులను దఱిమి, యా వెనువెంట తానే స్వయముగా, ససైన్యముగాబోయి, 29 తేదీన మూర్షిదాబాదు (రాజధాని) లో సైనికప్రభుత్వము నేర్పఱచి, కాపుకాచెను.

జగత్సేటు తనపని దాముగించుకొని, జరిగిన తలకాయల మాఱ్పుకు పాదుషా యామోదపత్రము గొనివచ్చి చేయిజాపెను.

ఓమిచందు క్లైవు నంటకాగుచు నతనికి గలుగగల లబ్ధిలో దనవంతు బుచ్చుకొనజూడసాగెను. డ్రేకు, వాట్సు:

బీచరు, కిల్పాట్రిక్ మొదలగు నాంగ్ల పాపకర్ములు గూడ తమతమ వ్రాటాలకై మూగిరి.

పెద్ద యేనుపందిని బడగొట్టుకొన్న వేటగాండ్రందఱు నెక్కడ తామి కనుమాటయిన పరులు మంచి భాగమును గొట్టివేయుదురోయని, ప్రతివారు నోడలెల్ల కనులు జేసికొని కూర్చుండునట్లు కూర్చుండిరి.

12 (షరతు) నియమములతో నొక సంధిపత్రము సిద్ధపఱపించి, క్లైవు క్రొత్తనవాబు ముందు బెట్టెను.

1. కంపెనీవారికి సూరజుద్దౌలా యిచ్చిన యధికారములు—స్వంత టంకశాల హక్కుతోసహా — సౌకర్యములు తాను నిచ్చుటకు

2 అవసరములలో నన్యోన్యము సైనిక సహాకారముండుటకు

3 ఫ్రెంచివారికతని రాజ్యములో నెట్టిహక్కులునుండ కుండుటకు

4 కంపెనీకి కోటిరూపాయములు నష్ట, కష్టముల బరిహార మొసగుటకు

5 కలకత్తా ఆంగ్ల బాధితులకు 50 లక్షలు బరిహార మొసగుటకు

6 కలకత్తా దేశీయ బాధితులకు (మూరులు, జెంటూలు మొదలగు నలుపులు) 20 లక్షల బరిహార మొసగుటకు

7 ఆర్మీనియన్ శాఖీతులకు 7 లక్షల బహుమాన మొసగుటకు

8 కలకత్తాచుట్టు మహారాష్ట్ర పరిఖ వఱకుగల మొత్తము భూభాగమును, అవతలఇరుకను 600 గజములవఱకు గల భూభాగమును కంపెనీకిచ్చుట

9 కలకత్తాకు దక్షిణమున గల్పీవఱకుగల సర్వరాజ్యమున కంపెనీకి జమిందారీ హక్కులుంచుటకును

10 ఆంగ్లసైన్యమును వానుకొనినప్పుడు కాగలవ్యయమునంత నవాబే భరించుటకు

11 హుగ్లీ దిగువను నవాబెట్టి కోటలను గట్టకుండుటకు

12 అన్నిటిని మీర్జాఫరు వెంటనే యాచరణలోఁ బెట్టుటకు

నవాబు సమ్మతించి, సంతకము బెట్టెను. క్లైవుకూడ సంతకము జేసెను. నౌకాదళాధిపతిగా వాట్సను, గవర్నరుగా డ్రేకు, వాట్సుకూడ యానిబంధనపత్రములో సంతకములు జేసిరి. క్లైవు క్రీస్తుపేరుతో బైబిలుబట్టి ప్రమాణము జేసెను. మీర్జాఫరుచే నల్లా, పైగంబరులపేర్లుచెప్పి, ఖొరానుబట్టి ప్రమాణము జేయించెను.

కలలోఁగూడ అనుకొనని మహారాజ్య మప్పనముగా లభించెనుగదా యని మీర్జాఫరు తలనూపెను. పాడియావు చేతిక్కనే జిక్కెనుగదాయని క్లైవు ముద్రాళ్ళు బోసి,

ముూ పెక్కు కూర్చుండెను. 8, 9 షరతుల క్రింద కాజేసిన భూములపై నెంత లేదనినను, క్లైవు లెక్క ప్రకారమే సంవత్సరమునకు బది లక్షలు రాగలవట.

పై సంధిపత్రములోని 12 నిబంధనలు బహిరంగములు. ఆపైన అంతరంగికముగా దేవరలకు మీర్జాఫరు సమర్పించుకొనవలసిన ముడుపుకొనవలసిన ప్రమొక్కుబడి నైవేద్యములకు సంబంధించి మఱికొన్ని యున్నవి.

కుంపిణీ యుద్యోగస్థులు దమస్వాంతమునకుగా నవసర నైవేద్యము 1½ లక్షల 80 వేలక్కడ పెట్టుమని, ఆ ప్రథమ తాంబూలమును నిలబడినపాటున నక్కడ పెట్టించుకొని స్వీకరించిరి. క్లైవు కందులో 2 లక్షల 80 వేలు, గవర్నరు డ్రేకు కు 2 లక్షల 80 వేలు, వాట్సు. బీచరు, కిల్పాట్రికు గార్లకు తలకొక 2 లక్షల 40 వేలు ముట్టెను. ఉపసేనాపతుల సంభావనలొక 50 లక్షలయ్యెను.

ఇవన్నియుగాక క్లైవు కగ్ర తాంబూలము క్రింద ప్రత్యేకముగా, నదనముగా 1 లక్ష, 60 వేలు మొహిరీలు(మొహిరీ యనగా 1½ తులముల బంగారు నాణెము) కృతజ్ఞతాసూచకముగా మీర్జాఫర్ నవాబు సమర్పించుకొనెను. క్లైవుకా ప్రత్యేక సంభావన చాలదనిపించినను వాపిరిగొట్టనుకొందురని తృప్తినొంది నట్లుతడే యొక పార్లమెంటు మిత్రునితో ననెనట.

పాపము నవాబు ధనాగారమున నప్పటికి 1 కోటి 50 లక్షలు మాత్రముండెనట. హుండీచిన్నది, విస్తళ్ళు

పెక్కునయినవి. జగత్సేటు మాటపై ననుకొనినదానిలో సగము ధనరూపమున గొంత సగము విలువకు వెండి, బంగారముల రూపమున గొంత వెంటనే యిచ్చుటకును, మిగిలిన సగము మూడు సాంవత్సరిక వాయిదాలలో ముట్టజెప్పుటకును సమ్మతి కుదిరెను.

మీర్జాఫరు రాజయ్యెను. కాని మనశ్శాంతియే కరవయ్యెను. తన ద్రోహమునకు మూల్యముగా, దన రాజ పదవికి ఖరీదుగా దా జెల్లించవలసిన ఋణభారము అప్పటికి గొంచెము దిగినట్లున్నను ఇంకనూ అంత దిగక అణచుచునే యుండెను. తానింకను జెల్లించవలసిన వాయిదాలు మూడు నూ మూడు కత్తికోఅల నోళ్ళు తెఱచుకొని మూడు వైపుల నుండి యతని నాక్రమించి నట్లుండెను. దినదినము గావలసిన పరిపాలనా వ్యయము తలపై వ్రేలు "డామక్లీసు ఖడ్గము వలె భీతి గొలుపసాగెను. ఇవికాక ఏక్షణమైనను రాగల వ్యయావసరపు తలంపు సింహపీఠియడుగునుండి పొడుచుకొని వచ్చుచున్న బల్లెముగా దోచెను.

గడ్డములోనియొక్కొక వెండ్రుక యొక్కొక కాల సర్పముగాదోచెను. భయపడి, కెవ్వునకేకవైచి, యిటు నటుజూచి, తన వెన్నుపై దానే తట్టుకొని, కనులు మూసి కొని పై యుత్తరీయము గప్పుకొని ప్రక్కకొఱిగెను. బలే లాభసాటి వర్తకమే సామ్రాజ్యనీతి! ఆత్మహత్యా సదృశమే బ్రతుకు తనఖాపెట్టుకొనవలసినద్రోహిది! వికటాట్టహాసములు జేయుచు నందఱులేచిపోయిరి.

గోతియొద్ద నక్కవలె గనిపెట్టుకొనియున్న ఓమిచందు క్లైవు ననుసరించి, చేతులు నలుపసాగెను. క్లైవుతన యాంతరంగిక కార్యదర్శి వాట్సును జూపి, తానును వెళ్ళిపోయెను. పాపమా నిర్భాగ్యుడు దనపత్రములో దనకేమైన ముట్టవలెనను నిబంధన లేదన్న తెలిసికొని నిర్ఘాంతబోయి యాయాతకస్మాద్పాదఘాతమునకు నడలుపడి, కట్టెవారి పోయెను!

అతడు మతిచెడి, పిచ్చియెక్కి, తిరిగి, తిరిగి, యెప్పుడో, యెక్కడో మరణించెనట పాపము! ద్రోహమునకు మూల్యమిది

* * * * * * *

దినములు గడుచుచున్నవి. ప్రజలవృత్తులకు నాస్తులకు బూర్వమున్న స్థైర్యము తగ్గిపోయినది. నజరానాల రూపమున తెల్లవారి దోపిడీసాగినది. ఇంకన నవాబు ఋణపరిష్కారము నిమిత్తము పన్నులు వేయసాగెను ఆ పన్నుల పైకమైన సేకరణ జరుగకొలది ఏదియో వ్యయము గన్పించి, నూయము కాసాగెను. కొంత బలవంతముగా మిగిల్చినను నక్షత్రక — దూతల వట్టముక్రింద నరిపోవుచుండెను. రాజధానిలో రాజ్యసహాకారమునకుగానుంచిన తెల్ల సేనలకిచ్చుచుంటచే రాజకీయోద్యోగులకే కాక సైనికులకుగూడ జీతములే ఋణపడెను. ఎల్లెడనసంతృప్తి, అవిధేయత, లంచముల, వట్టములబాధ పెఱిగిపోయెను. ఆంతరంగికమగు నీబాధ లిట్లుండ

నింతలో గోరుచుట్టుపై రోకలిపడినట్లు బైటనుండి యువ పాదుషా,అయోధ్యనజీరు నవాబు) నతనిపై దండెత్తిరి.

ఇక్కడ నేయున్నది క్లైవుజిత్తు. నవాబుసేనలనే సమీకరించుకొని, రాజధానిలో నుంచిన తమసహకారసేనను జత పఱచి, నవాబు ధనము దినుసులనే యుపయోగించి, స్థాన బలము గలిసిరా గొంత కష్టముమీదనేయైనను వారినోడించి తరిమివైచెను.

ఎక్కడి గొడ్డలియోవచ్చి యొకచెట్టురెమ్మను పిడి గావించుకొని, దాని కొమ్మలనే నఱుకగలిగినది.

## క్లైవు కుట్ర

తన రాజ్యాదాయము బరులకు తనఖాపెట్టి, తన విదేశీయుల కమ్ముడువోయిన మీర్జాఫరు తన ప్రజలముందు తేలికయైతి ననుకొనుచు, దనబ్రతుకు తనకే హాస్యాస్పదము కాగా చావలేక బ్రతుకుచుండ గలిగిన యీక్రొత్త విపత్తు నుండి యతనిని గాపాడి క్లైవు తిఱిగి ఏమొసంగెదవని చేయి జాచెను. ఏడువలేక నవ్వినట్లు మీర్జాఫరతనిని దన యాస్థానమున సామంతు (ఉమ్రావు) గావించి, యీక్రొత్త యంతస్థుకు దగినట్లతనికి 27 వేల నవరుస్లు సంవత్సరాదాయము వచ్చు జాగీరు జదివించెను.

దైవికముగ నప్పుడే ఫోర్డు సేనాని దక్షిణాదిని నైజామును మొట్టి, ఉత్తరసర్కారులు సంపాదించెను. క్లైవు

విజయగర్వమున దబ్బిబ్బయి, ఆ 1759 జాన్యువరి 7 వ తేదీన ఆంగ్లప్రధానివిలియంపిట్టు దొరకు దన యంతరంగ మంతయు దెలిచి, యొక యుత్తరము వ్రాసి, వాల్షుకిచ్చి పంపెను.

అయ్యా, ... ... బ్రిటిష్‌జాతికి లాభించు నేపనినైనను జేయుటకు గంకణముగట్టుకొన్న తమదృష్టిలోని కొక విషయము దెచ్చుచున్నాను. ఈ మధ్య నీ మూల నిండియాలో గంపెనీవారికి గల్గిన లబ్ధినిగూర్చియు, ఇంకనూ కలుగగల దానిని గూర్చియు మనజాతికి దెలియును.

మనకిక్కడ నొక గొప్ప సిరి పట్టనున్నది. దాని కర్హులమగుటకు గనీసము ఫ్రెంచివారికి గలిగినంత దైనను సేన కావలయును. మనచేతిలో గీలుబొమ్మగానున్న బెంగాలు నవాబుపై మన పట్టు నిలిచియుండుటకుగూడ నది యవసరము. అతడీమధ్య గొంచెము స్వతంత్రముగా బ్రవర్తించుచున్నాడు. అతని పుత్రుడు మీరానుకు మనమన్న పడదు. అసలు మహమ్మదీయ జనులకే కృతజ్ఞత యనునది యుండదు. రెండువేల యాంగ్లసైనికులున్నారా—అవసరమైన సూత్రములను స్వయముగా మనమే ధరించవచ్చును.

ఇక్కడ దేశీయ ప్రజలకు బ్రత్యేక ప్రభువులయెడ నభిమానము లుండవు. వారికి గావలసినది శాంతి, భద్రత. ఈనవాబు పాలనలో నవిలేవు. కావున అమర్థుడగు స్వదేశీయుని పాలనకంటె సమర్థులగు విదేశీయుల పాలనకే తల లొగ్గుదురు.

పాదుషాకతనికి ముట్టవలసిన వైదవపాలు సుభా. దాయము సంవత్సరమునకు 50 లక్షలు గ్రమముదప్పక ముట్టజెప్పువారు ఎచో జాలును ఆమోదించును. ఇప్పటి నవాబాపని చేయజాలకున్నాడు. సత్యసంధతకు, యుద్ధనిపుణతకు, కార్యనిర్వాహణదక్షతకు బేరుమోసిన మనమే యీ పని జేసిపెట్టుదుమన్న నతనికింక కావలసినది యుండదు.

ఈ మధ్య పాదుషా ప్రధాని సితాబురాయి గారు నవాబుకు దివానులుగా కంపెనీని నియోగింతుమని కూడఅవి యున్నారు. నేనేసమయముగాదని తొందఱ పడలేదు. ఇప్పుడే అంగీకరించిన నవాబు కీర్ష్య కలుగును. తేపో, ఎల్లుటో అదియు జరుగును. ఆపదవినుండి సుబేదార్లగుట చిన్న మెట్టే.

దేనికైనను సైన్యము గావలెను. కంపెనీవంటి వర్తక సంస్థ దాని నొసగలేదు. సంపాదించుకొన్న సుభాను నిల బెట్టుకొనుట చాల కష్టము. స్వంత సైనికులు లేక యది కుదురదు.

ఏమో యీ పథకమును జాతికి ధర్మకర్తలగు తమ యెదుట నుంచితిని సర్వసౌభాగ్య విలసితమగు నీ ఎల్‌డొరేడో మనము కావలెనన్నచో మనదయిపోవును. మన దేశముయొక్క యవసరములకిది యెంతయవసరమో యాలోచించుకొనుడు.

జాతీయ-ఋణభారముతో నిట్టూర్చుచున్న మన కీ సామ్రాజ్యాదాయ మెంతముఖ్యమో తెలిసికొనుడు అంతి

యే కాదు. ఈ దేశములో వ్యాపారము జేసికొనుచున్న యనేకులు మన యూరోపియనులుగూడ యీయెత్తుతో మన దయ ధర్మము సానుభూతి అనుగ్రహములపై నాధారపడు పరిస్థితు లేర్పడును.

అమెరికాలోవలె నీదేశములో మన మాతృదేశము నొడిసి, తెచ్చుకొని, వాడుకొనవలసిన పని లేకయే మన ప్రణాళిక నాచరణలో బెట్టగలము.

మనది అనుకొనగల సైన్యమేమాత్రమున్నను దానికి దోడుగా గావలసినంత దేశీయ సైన్యముగూర్చుకొనవచ్చును. దేశీయ రాజులకంటె మన మెక్కువ యిచ్చి, హెచ్చుగా జూతుమని నలుపులు మన సేవలోనికి గంతులువేసికొనుచు వత్తురు.

జాతి (బ్రిటిష్) హిత జీవనులగు తమయంతవారి ముందీ జాతీయాభివృద్ధి ప్రణాళిక నుంచగలిగితిని కదా తప్పక యంగీకరింపబడ గలదని యాశ.

ఇంకొకటి. ఈకొమ్మ నందుకొందుమా—తప్పక దాని యాధారమున వృక్షాగ్రము జేరగల మని విన్నవించు—....

రాబర్టు క్లైవు.

పిట్టుదొర కాలోచన తెగలేదు. లోకసభ పక్షమున దా సైన్యము లొసగి, సహకరించినచో రాగల సామ్రాజ్యము నాంగ్లరాజు స్వంతమునకు గాజేయునని కొంత కంపెనీ వ్యక్తు లనితరలభ్యములగు ధనరాసుల గడించి, వానితో

సంస్థానములు సంపాదించి యాజమాన్య ప్రభువుల కసూయగలుగు నట్లు మిగులుదునసి కొంత వెనుకాడెను.

ఆయన యూహాసక్తిమైనదే. 1760 సంవత్సరం ఫిబ్రవరి నెలలో కలోనెల్ క్లైవే యింగ్లండు జేరి సంవత్సరమునకు 40 వేల నవాసు లాదాయముదెచ్చు సంస్థానము సంపాదించు కొని బర్క్లే-బజారులో గొప్ప సౌధమునుగొని, నీతి బాహ్యముగ కొన్ని జిల్లాల వోట్లుకొని, లోకసభ సభ్యుడయ్యెను. కంపెనీ డైరెక్టర్లతనికి రత్నములపిడికల ఖడ్గమును బహూకరించి సన్మానించిరి. మూడవ జార్జిరాజు వానికి ప్రభు బిరుదమునిచ్చి, కీర్తించెను. తుదకు ప్రజాభిమానమును బురస్కరించుకొని, పిట్టుమంత్రికూడ యతనిని బొగడవలసివచ్చెను.

క్లైవు దినమునకొకవిధముగా నుడుపులు ధరించుచు, ఢిల్లీపాదుషావలెనో, బెంగాలు సుబేదారువలెనో, కలోనెల్ వలెనో, లార్డువలెనో పీష్వావలెనో, రసపుత్రవీర సింహాము వలెనో—ఇంతలో నిట్లు, అంతలోనట్లు వేషములు వేసికొని తన లోకసభవర్గము 12 మందియు వెంటరా దర్శనము లొసగుచుండెను. నాగరకు లతని పటాటోపముగని నవ్వుకొనినను స్త్రీలు బరిహసించినను సామాన్యజనులుమాత్ర మతనిని జూచుటకై విఱగబడుచుండిరి. అతని యనితర లభ్య గణనీయతనుగని, కంపెనీపాలకులుగూడ ఈర్ష్యపడుచుండిరి.

క్లైవు కవ్వ జ్ఞాపకమున్నది. ఏదినములలో నవ్వ తన యీభవిష్యత్ప్రాభవము నంతను దివ్యదృష్టిని గ్రహించి,

దోహదము జేసినదో యీ దినములలోని నిత్యదృశ్యమును స్మృతి యందున్నది. 20 సంవత్సరములనాటి యీదృశ్యము కథాకథన శ్రవణ సంబంధి—ను జి తింపించెనుగూడ. ఆ నాటి తన నిర్గమన దినమునకు వార్షికోత్సవములు జరిపించుచు నవ్వాలకు సుగంధద్రవ్యములు, జెఱకు బెల్లము బంచెడివాడు.

## దొంగల దోపిడీ

ఆదినములలో ప్రతి కంపెనీ యుద్యోగియు దానొక సిందబాదునో, గలివరునో, రాబిన్సన్ క్రూసోనో, పిజారోనో కోర్టెజునో, మార్కో-పోలోనో, థామస్ రోనో, రాబర్టుక్లైవు నో, అనుకొనెడివాడు. స్వభావసిద్ధముగా వారికి భారత దేశ మొక ఎడ్రజములలోయవలెనో లిల్లిపుటువలెనో, నిధి ద్వీపము వలెనో, పెరు వలెనో, మెక్సికోవలెనో, ఎల్ డొరెడోవలెనో అగుపించుచుండి యుండును. భారతీయులు వారి కనులకు జంతువులు, పక్షులవలెను, లిల్లిపుటియన్లవలెను, అడవిమనుష్యుల వలెను, నలుపులుగాను, మోక్షమునకు వెలియైన మొఱటు పాషండులుగాను, తెలుపుల సౌకర్యమునకై సృజింపబడిన జీవములుగాను కనిపించియుందురు. చీము, నెత్తురు, అభి మానము, అనుభూతి, ఆశయములు, ఆదర్శములుగల మాన వులుగా దోచియుండరు. కామ, క్రోధ, మోహ, లోభ, మదమాత్సర్యములు దమకేకాని వీరికుండవని యూహ. పాడిపశువుల వలెను, గ్రామిక జీవములవలెను దలలు వంచి వశమై సేవించవలసినవారేయని ఆలోచన. తేటులు గూఱ్ఱు

కొను తేనె, ఆవులు పిండుకొనుపాలు, పందులు పెంచుకొను కండ, కోళ్ళుపెట్టుకొను గ్రుడ్లు, వృక్షములు గాయు నానాగ దినుసులు దమకొఱకే యని మానవులందఱు మనుకొనునంత సులువుగాభారతీయులుగూడ్పుకొను, పిండుకొను, పెంచుకొను పెట్టుకొను, పండించుకొనుభాగ్యములన్నియు దమకొఱకేయని యనుకొనుచుండిరన్న నతిశయోక్తి కానేఱదు. మేతమేపి, కుడితిత్రాపి, దూడల నోళ్ళుగొట్టి, గోమాతల స్తన్యముల బిండుకొందు రెవరైన. వారట్లుకాదు. దూడలు సచ్చిన గడ్డిదూడలజూపి బీటిలోమేపి, ఏటిలోద్రాగినబక్కయావులను రక్తముతోసహా పిండుకొనుటయే వారికి తెలుసు. ఎఱువులు వేసి, బలము జేసి, పంటలు పండించుకొను వ్యవసాయపద్ధతి గూడ మఱచి, గాలి ప్రోవుజేసి, యంత్రములపై నుండలు చేయుట మఱగినారు. ఇంక మన ధాన్యముతోనే బిస్కెట్లు మన ప్రత్తితోనే వస్త్రములు, చివఱకు మన గంగాజలమునే వారిశంఖములతో తీర్థముగానిచ్చి, మన బంగారమున కెత్తు కెత్తు నొసగుటకు చూచుచున్నారు.

అదీ నాటి యాంగ్లేయవీరుల మానసికవ్యవస్థ. జన సామాన్యము వారనుకొనునట్లే మూగజీవములవలె లోబడిరి కూడ. మఱియు నాస్ట్రేలియా యిడు వర్గస్థులవలె నిరోధించ లేక నశించిపోకన్యూజిలాండర్లవలె, అమెరికనులవలె మిశ్రితమై పోక ఆఫ్రికనుల వలె అణగిపోకయున్నను కేవలం శాంతి, భద్రతల నాశించి యసమర్థులగు స్వదేశప్రభువులను విశ్వ సించలేక పరదేశీయులయినను నింగ్లీషువారి పాలనకు దః

తొగ్గుట నలవఱచుకొనిరి విజాతీయులు, విమతస్థులునైనను దనుహృదయములకు హత్తుకొనబోయిరి. కాని వారు కౌగిలించుకొనగల్గినది పాశములనే!

చిత్తమాముష్మికతలమున భక్తి, భార్యాబిడ్డల పక్షమున నుంచుటచే పాపము జాతీయదృష్టి, దేశభవిష్యదాలోచన మందగించినవి. క్లైవు పిట్టుమంత్రికి వ్రాసినట్లు నాటి యాంగ్లేయులకు ప్రజాశక్తి భయభీతుల గలిగించనే లేదు. అట్టిచో దలలు మాఱ్చుటలో వారికంత భయముండెడిది కాదు.

పట్టిపోయిన యావును స్వంతయజమాని మేపుకోవచ్చు. కాని పాలకై కూర్చున్న యన్యునికది యేల? దానిని వదలించుకొని, కొంచెము కష్టమైననుమఱియొకపాడియావును దెచ్చుకొనును. క్లైవు తరువాత కలకత్తాలో వాన్సిటార్టు అధ్యక్షుడు. అతనికి మీర్జాఫరుపై రాజభక్తి కాదుకదా దాక్షిణ్యమునుండదు అతనిని తొలగించి, యతని యల్లుడు మీర్ మహమ్మద్ ఖాసింఖాను నొద్ద 2 లక్షల నవరసులు తీసికొని యతనిని సింహాసనమున కూర్చుండబెట్టెను. అతనికి హోల్వెలు మొదలగువారు వంతవచ్చిరి.

10–11–1760 న కలకత్తా చీకటిగది కథకుడగు బోగస్ చరిత్రకారుడు హోల్వెలు 'మీర్జాఫర్‌ను తొలగించుటకు కారణములు' అని యతడు చేయని నేరములనన్నిటిని కలిపి యొక ఛార్జిషీటు సిద్ధపఱచి ప్రకటించెను. ఆయన చంపించెనని పేర్కొన్న 78 మందిలో 76 గురు బ్రతికియే

యున్నట్లు 30-9 1766 న కంపెనీ కవున్సిల్‌వారే యొప్పు కొనిరి.

ఆ తలమాఱ్పులో కంపెనీవారికి బర్ద్వాను, మిద్న పూరు, చిట్టగాంగు జిల్లాలు శాశ్వతముగా దక్కినవి. వచ్చిన ధనములో వాన్సి టార్టు 58 వేలు, హాల్వెలు 31 వేలు సమ్నరు 8 వేలు, కెయిలాడు 23 వేలు, నాత్మనై వేద్య మునకై స్వీకరించిరి.

తాముగావించిన నవాబేకదా తమకింక నడ్డేమియని చాల యలుసు జేసిరి. కంపెనీవారి వర్తకపు సరుకులపై పన్ను పుచ్చుకొనకయేవానిని బోనిచ్చు నాచారమెప్పటినుండియో ఏర్పడినదికదా. ఆ యనుమతి పత్రములను జూపి ప్రతికంపెనీ యుద్యోగియు స్వంత వర్తకము జేసికొనుట సాగించిరి. దాని వలన రాజ్యాదాయము, తగ్గుటయేకాక దేశీయ వర్తకులకు బాధకలిగెను.

మీర్ఖాసిం సమగ్రతతో కంపెనీ యప్పునేకాక సేవకుల సైనికుల జీతములగూడ పూర్తిగా నిచ్చివేసి, దేశీయవర్త కులపై గూడ పన్నుల దీసివైచి, ప్రజారంజకుడయ్యెను. కంపెనీవారినిగూడ నేరస్థులయినప్పుడు శిక్షించసాగెను.

వట్టియావును వదలించుకొని, పాడియావును దెచ్చు కొనుటయే స్వభావముగాగల కంపెనీవారతనిని దఱిమివైచి తిఱిగి మీర్జాఫరుతో బేరములు సాగించి యతనిని వరించిరి. ఆయన అంతవఱకు కంపెనీవారికున్న వన్నిటి నామోదించు టయేకాక, దేశీయవర్తకులపై పన్నులు బెంచి కంపెనీవారికి

తీసివేసెను. సున్నము, సురేకారము వారికిచ్చివైచెను కంపెనీకి 30 లక్షలు, ప్రత్యేక వ్యక్తులకు మఱికొన్ని లక్షలు నిచ్చి, చేతులుమోడ్చి చెంపలు వేసికొనెను అదికాక నెల కైదు లక్షలు వరుమాన మేర్పాటైనది.

1764 లో బంగాళములో జరుగుచున్న తలకాయల గారడీ గూర్చి షాఆలం చక్రవర్తికి అయోధ్య నజీరు (నావాబు సుజా ఉల్ దాలా హతభాగ్యుడగు మీర్ఖాసిం తెలియజెప్పిరి. పాపము! పాదుషా తనప్రయోజకత్వమింకను బనిచేయుననుకొని, సేనల దీసికొని, మందలించ వచ్చెను. బక్సారుయొద్ద కంపెనీ సేనలుమాయజేసి పాదుషాను, వజీరును బట్టివైచినవి. రాజనీతి విశారదులు గావున సామ్రాజ్యము సన్నగిలినను అఖిలభారతమునకు నభిమానితుడగు పాదుషాను గౌరవించి, పంపిరి.

## దొంగల దోపిడీ ;; పునాది కిటుకు

తాము నిర్మించబోవు సామ్రాజ్యభవనమునకు బునాదులు బెంగాలులో తీసిరి. పాదుషాదొరికిన ఎంతబాగుం డును పునాదిలో బిగించుటకు. పనసకాయ దొరికినప్పుడే తద్దినము బెట్టుమందురు పెద్దలు. పాదుషా తనయంత వచ్చి తమకు జిక్కెను. ఇంక వారికి గావలసినదేమి? తమ ప్రతాపమును వీరు, వారు జెప్పగా వినుచుండెడిపాదుషా యిప్పుడు స్వయముగా రుచిజూచెను. ఇంక నతనికి దమ పెద్దబుద్ధిని గూడ రుచి జూపదలచిరి.

చేపను బట్టుట కెజువేయుచుగ. అక్కో వారొక గాసక్షీ చేసిరి. అయోధ్య వజీరును మొట్టి, అలహాబాదు, కోరా జిల్లాలు దీసికొని, సాఆలం చక్రవర్తికి బహూకరించిరి. అత్త సొమ్ము పెద్దత్తకు దానమిచ్చినట్లున్నను పాలం సదభిప్రాయము, సౌహార్ద్రము వచ్చినవి. అందులో నొక రాజకీయరహస్యమున్నది. అతిలోక పేరుడు సుజాఉల్ దౌలాకు, బెంగాలులోని దమకు నేక సరిహద్దుండుట అపాయకరము. మధ్య నిద్దఱకు దూరమునసుండు పాదూషా ప్రతినిధియుండుట మేలు

1765 లో మీర్జాఫరు చనిపోగా, అతని కుమారుడు నూజముల్ దౌలాను గద్దెపైనుంచిరి. పిచ్చినవాబు మరణ శాసనములో క్లైవుకు 60 వేల నవరసులిచ్చిపోయెను.

ఇంకనేమి? ఇన్నినాళ్ళు దగ్గఱనున్న బెంగాలు నవాబు మెత్తనివాడేయనుకొనినను దూరమున నున్న అయోధ్యవజీరు, ఢిల్లీపాదుషా ఎంతటివారో యను భయముండెడిది. ఇప్పుడది కూడ తొలగినది. ఇంకను అజ్ఞానాంధకారములోనే పడియున్న జనశక్తి మేల్కొనకుండ జాగ్రత్త పడగలుగుచో సమస్తభారతము తమకు వీరవిహారమే కాగలదు. రాజుల, నవాబుల, పాదుషాల తలలమీదుగా విహరించవచ్చును.

బ్లాకుమార్కెటు చేసియో, లంచములు మేసియో ఇండియాలో మొయ్యలేనంత బంగారము ప్రోవుచేసికొనిన ప్రతికంపెనీ సేవకుడు నింగ్లండుచేఱుట గనినప్పటినుండియు కంపెనీవారికి జాల బాధగానుండెను. ఇండియనుల నెంత

పీడించి, గడించుకొనినను వారికి పట్టలేదు. కాని తమ పెట్టు బడి, తమ మనుజులు, తమ యుద్యోగులు, తమ యోడలు, తమసౌకర్యములు, తమపలుకుబడి, సర్వము నుపయోగించు కొని తమ గిడ్డంగులలోనే, తమ వతనుదార్లకే సరకు లమ్ము కొని తమలాభములనే పంచుకొనుచున్నారని తెలిసినప్పుడు వారియొడలు మండిపోయెను.

ఇండియాలో నవాబు తన ప్రజలయొద్ద వర్తక సుంక ములను సేకరించుచు, బరదేశీయ వర్తకులను వర్తక సుంక ములు లేకుండ వదలిపెట్టుటచే తన రాజ్యాదాయమును తగ్గించుకొనుటయేకాక తన ప్రజలు స్వదేశవస్తువులనే పర దేశులకంటె ప్రియముగా నమ్ముకొనవలసివచ్చుట బాధా కరమని యప్పుడు తెలిసినది. అందులకై వారు కంపెనీపేరు మీద నవాబును, అతని ప్రజలను జాల యొత్తిడి బెట్టుచుండి యుండిరనియు, కంపెనికి దేశీయుల సౌహార్ద్రమును గూడ నష్టము జేయుచుండిరనియు గ్రహించిరి.

ఆంగ్లజాతికి సామూహికాంతరాత్మ యనదగిన బర్కు ప్రభువు వంటి మహోదారులకది తెలిసినప్పటినుండియు పి రండలు నక్కడ పదిమందినోట పడి, యీగీకాజొచ్చిరి. ఇంగ్లండులో నుప్పునకు గొఱగాని ప్రతిసోమరివాడు తూర్పిం డియా వర్తకసంఘసేవలో జేరి, నాలుగు నెత్తురు బొట్లు చిందించి, నవరత్నముల దోలితెచ్చుకొనుచున్నట్లు గోచ రించెను.

దగా, మోసము, అన్యాయము, హింస, కపటనీతి, దోపిడి వీనియన్నిటికినీ కలిపి యొకేమాట యగు సామ్రాజ్యవాదమొక విషము. ఆవిషము జాతీయ శరీరమున బ్రవేశించినచో నాజాతి పతనముకాగలదు, జాతిలోని యుత్తమాశయములు నశించిపోయి పరిణామము వెనుకకుసాగును. మేమతువంటి బలప్రధాన జీవనులు పేరుకూడ లేకపోయినవి. ఆత్మజీవియగు మానవుని కమరత్వమే!

ఈ విషముసోకి, దేవునివాక్యమును ప్రచారము జేయవచ్చినపవిత్రోద్యోగులుగూడదోషవర్తనులును, పాపములో భాగస్వాములు నగుచున్నారనిన వింతలేదు, హిందూదేశములో నిరర్థకముగా విగ్రహముల కర్పింపబడు ద్రవ్యమంతయు నింగ్లండులో సద్వినియోగపరుల జేరుచున్నందుల కని మతాచార్యులు దినదినము బ్రార్థనలలో భగవంతునికి ధన్యవాదములర్పించ సాగిరనిన వారి నైతిక ప్రతిపత్తి యెంతదోషమయమైనదో తెలియగలదు.

కుంపిణీడైరెక్టర్లకు రికార్డులు, లెక్కలు, నివేదికలు, పద్దుపుస్తకములు, వ్యవహారములుకాని కంపెనీ సేవకులు, సైనికులు, నధికారులకు మోయలేనిధనము! తోడు దొంగలింటికి జేరినతరువాత వంతులు తెగనప్పుడు, ఉప్పుకు గతిలేని వారికి లప్పులు సేరినప్పుడు పార్లమెంటు సభ్యులవఱకు బో సాగినది.

చివఱ కందఱు గలిసి, వ్యక్తులకేమియు నందనీకరాగల సామ్రాజ్యాదాయము, వర్తకలాభము నంతయు,

కంపెనీకే చేర్చగలుగుట ఎట్లా? కంపెనీ వాటాదార్లు 100 కి 10 రూపాయలైన లాభము బంచుకొనుట యెట్లా? అని చూచిరి తగిన వ్యక్తికొఱకు జూచిరి.

ఘరానారాబర్ రాబర్టుక్లైవు ప్రభువుకనిపించెను. అందఱు ననుకొని, యీ యింటిదొంగకు దాళము లప్పగించిరి. క్లైవు బ్రిటిష్ వారి ఆసియా సామ్రాజ్య సేనల కన్నిటికి సర్వసైన్యాధ్యక్షుడుగా నభిషేకింపబడెను.

ఇక్కడ ఇండియాలో నజాముద్దౌలా నవాబుగిరీ మొదలు వాన్సిటార్టు కంపెనీ యధ్యక్షపదవినుండి విరమణ జరిగినవి. క్లైవువచ్చి యధ్యక్షస్థానము నలంకరించు నఱకు స్పెన్సర్ వచ్చెను. నజాములుదౌలా పసివాడగుట యాతని రెక్కలు మఱికొంచెము కత్తిరించెను. నంద కుమారుడను మహామంత్రిని దొలగించి, తమకిష్టుడగు రజాఖానును గుదిర్చిరి. అతని స్వంతసైన్యము నంతను రద్దుచేసి, తమసైన్యమే యతనిదనిరి. రక్షణశాఖను బూర్తిగా తమ క్రిందికి తీసికొనిరి. తమ మామూలు హక్కులు, నజరానాలు, నహుమానములు, స్వేచ్ఛావ్యాపార సౌకర్యములు నన్నియు బొందిరి.

3 మే 1765 న క్లైవు కలకత్తా తిఱిగి చేరెను. ఈమాఱతనిని, సమ్నరు, సైక్సు, కార్నకు, వెరెల్స్టులను కలిపి యొక సంఘముగా నియమించి, ఇండియాలోనున్న దొంగల దోపిడీని, అరాజకమును, అవినీతిని సంస్కరించుమని కంపెనీ వారాజ్ఞాపించిరి. చేనుమేసెడి మేకనే దాని కాపలాకు నియమించితిమని వారనుకొనినట్లు లేదు.

క్లైవు కమిటీవారు వచ్చినంతనే కంపెనీ యుద్యోగుల పదవుల నొకటిదాని నొకటికి మార్చిరి. దేశీయులనుండి బహుమతులు దీసికొనకుండ ఖరారునామాలు దీసికొనిరి. లొంగని వారిని పనులనుండి తొలగించిరైనను శాంతి, క్రమపద్ధతు లేర్పఱచిరి.

* * * * * *

బ్రిటిష్‌వారంతటివారు తన్నంత గౌరవించి పంపినందుకు షా ఆలం పాదుషా యుబ్బిపోయెను. అట్టివారు తనకు మిత్రులైనందుకు దబ్బిబ్బైపోయెను. వారి ముద్రికపై 'ఢిల్లీ పాదూషా పాదసేవకులగు కంపెనీ' అని చెక్కించుకొనుట యతనికి గర్వహేతువైనది.

నవాబైనను పన్నులసేకరణలో నాంగ్లేయోద్యోగుల సహాయము దీసికొనుచునే యుండిరి.

రజాఖాను వారి ప్రతినిధియేకాక బీహారు రాష్ట్రమునకు నాయబు, నవాబుకు ప్రధానికూడనై యుండెను. అట్టిచో బెంగాలు, బీహారు, ఒరిస్సా రాష్ట్రములకు మూడింటికినీ వారినే దివానులుగా నేర్పఱచుకొనిన బాగుండదాయనిపింప జేసిరి. నవాబునకెట్టి శ్రమలేక పన్నులు సేకరింపబడి, యతని వాటా యతనికి వచ్చు నేర్పాటుండుటచే నతడుకూడ సంతసించెను.

12-8-1765 న పాదుషా ఫర్మానా జారీయయ్యెను.

నవాబు పాదుషాకు చెల్లించవలసిన సాంవత్సరిక కప్పము 26 లక్షలు వారే పాదుషాకు నేరుగా చెల్లించుటకును

నవాబుకు రు 53 లక్షల 86 వేల 1331–9 చెల్లించు టకును

మిగిలినదంతయుకంపెనీవారుంచుకొనుటకునుఏర్పాటు.

* * * *

అది కేవలం కరసేకరణాధికారమే. ఐనను వారది రాజ్యాధికారముగా భావించిరి. కాదనినవారు లేకపోయిరి. ఢిల్లీ పాదుషాకు త్రాగి, తందనాలాడుట కనుకొన్న వేళకు 26 లక్షలు వచ్చిపడునంతవఱకు ఎవరును కాదనలేరు.

ఈ వ్యవహారము నడిపించి భవిష్యత్సామ్రాజ్యము నకు బునాదికీలు వేసినకీర్తి రాబర్టుక్లైవుది.

క్లైవు కంపెనీ డైరెక్టర్లకు పన్నులసేకరణ తమ చేతి లోనికే వచ్చుటచేత దానిలో నామధ్య నేర్పడిన గందర గోళము దొలగిపోయినట్లేయని వ్రాసెను.

బెంగాలు–బీహారు–ఒడిసాలలో శిస్తుమొత్తము 2 కోట్ల రూపాయలకు మించును.

* * * *

కాలం గడచినది. ఇండియాలో కంపెనీ వ్యాపార లాభములకు ధర్మకర్తగా నేర్పడిన క్లైవు, సైకన్సు, సమ్నరు లకు గూడ స్వంత వ్యాపారపు వెఱ్ఱి యెత్తెను. ఇంకెందులకు? వారుకూడ ఉప్పు వ్యాపారము సాగించిరి.

ఒకరిని బహుమతులు తీసికొనరాదనియు, స్వంత వర్తకము కూడదనియు నిషేధించిన క్లైవు కోడలికి బుద్ధిజెప్పి,

అత్తయే తప్పు జేసినట్లు చేసినాడు. శాసనములు శాసితులకే కాని శాసకులకుగాదు కాబోలు! పెద్దచదువుగాని శిక్షణ గాని, ఆదర్శములుగాని, వారసత్వమున వాతావరణమున పవిత్రతకాని లేని క్లైవునుండి అంతకంటె గొప్ప యుదాహరణల నభిలషించుట పొరపాటు.

1766 లో నజాముల్‌దౌలా పోయి, అతని తమ్ముడు సైఫుల్‌దౌలా సింహాసనమెక్కెను. ఆయన కంగరక్షకులను దామే సమకూర్చి, ఆయన కొసగవలసినదానిలో 12 లక్షలు కోసిరి.

## దొంగల దోపిడీ iii (క్లైవుఅనంతరం కాటకం)

క్రీస్తుభగవానుడు 'పొరుగువాని సొమ్ము కాసపడకుము. జేపటికై పేర్చుకొనకుము. కామిని, కాంచనము, కల్లునను కకారత్రయము సైతానువర్గము.' అన్నసూక్తిత్రయము అందుబాటులోలేని లబ్ధిని కూర్చినది. సంస్కృతి గంధములేని క్లైవు, వాన్సిటార్టు, వరల్‌స్టు, కార్టియ రిత్యాదులగూర్చి యనుకొనునదియు గద్దలదిను సర్పములగూర్చియు, నరాశనులగు వ్యాఘ్రములగూర్చియు ననుకొనునదియు నొకటే. వారి సంగతి నటుంచుదము. తమ క్రైస్తవ ఖండములో దమ మానవోద్ధారక దీక్షాకంకణములు అవకాశములు, అందుబాట్లు, ఆహ్వానములు లేక వాడిపోవుచున్న వనియు, దమసేవకై మిగిలిన యసంపూర్ణులే కాదు, భూములే యక్కడి లేవనియు, కేవలము మన నలుపుల నుద్ధరించుకొటకే, యా భారమును వారి భుజస్కంధములనుంచి

భగవంతుడు వారిని సృజించెననియు, జెప్పు నా క్రైస్తవ మతస్వాముల నందము.

వర్తకవ్యాపకులు. వలసల వేలుగాండ్రు, సామ్రాజ్య సంపాదకులు, నిధ్యన్వేషకులు మొదలగు లౌకికజీవుల వెంట నుండి, వారు సైతాను రాజ్యములో జిక్కుకొనకుండ రక్షించుటకని బయలుదేఱిన క్రైస్తవఫాదిరీ స్వాములు వారి విషముల హరించుటకు బదులు తామే యావిషముల కెఱవైనారు, తమ పవిత్రగ్రంథములను వారికి డాళ్లుగా, తమ పవిత్రాంబరములను వారికి గవచములుగాగూడ బసగినారు.

పాపమా క్రైస్తవస్వాములు గొందఱు తమ కాగడాలు దీసికొని ఏచీకటిఖండములకో పోక సూర్యుని జన్మస్థానమగు దూర్పిండియాకు వచ్చుట తటస్థించినది. 'అవకాశములు లేనప్పుడు కల్పించుకొనువారే యధికు' లను వాక్యమును దీసికొని, సైతాను సహాయముతో దాని కొక వంకర వ్యాఖ్యానము సృష్టించుకొనిరి.

ఇండియాలోని ప్రజలు దమ పారలౌకిక జీవితములకు వలసిన శాంతి, భద్రతలు కొఱవలేక, తమకు వానిని బ్రసాదించుచున్న పాలకు లెవరో వారిపేర్లు కూడ తెలిసికొను నవసరములులేక, రాజిక, దైవికములగు ఈతిబాధలు లేక, వేసియు వేయనట్లుండుట జూచిరి.

సింహాపీఠులపై సూరజులున్నను, మీర్జాఫరులున్నను, మీర్ఖాసిములున్నను, నూజముల్, నైఫులులున్నను, ఎవరైన నున్నను, ఎవ్వరు లేకున్నను, వారిముక్రదాళ్ళు ధర్మ దేవత

హస్తములలో నున్నను, క్రైస్తు కంపెనీ గుప్పిలిలో నున్నను క్రింది పాలకాధికారుల చక్రము చెక్కు చెదరక యున్నంత కాలము—ప్రజల పీటల క్రిందికి ఎసరు వచ్చినది కాదనియు, తీరావచ్చునదికి తామొక సాలీని చిక్కులో దగుల్కొని, తెప్పరిల లేనట్లు, తమ్ము బాధుచుకొని, తమ రక్తముబీల్చు చున్న సాలీలకే దయవచ్చితప్ప పురువులవంటి తమకు తరుణోపాయము లేదని గ్రహించి నిస్సహాయత నిస్పృహాలలో గనులు దేలవేయుచున్నారనియు గ్రహించిరి.

అనాదులు ప్రపంచమునకే గురుస్థానములు నగు తమవైద్య విజ్ఞానమందిరములు, విద్యా ప్రదాన కేంద్రములు దయ్యాలచే, పిశాచములచే నాశనము గావింపబడినట్లును వానిని బునరుద్ధరించు శక్తి, సామర్థ్యము, అవకాశము దమ యధికారుల కప్పుడు తాత్కాలికముగా లేనట్లును, ఉన్నను సైతాను పడనీయక పోవుచున్నట్లును దేశీయులు నిరాశు లైరని తెలిసిరి.

ఇంకేమి? క్రీస్తుప్రవేశించుటకు నావకాశమైనది! ఆ సైతానుయొక్క ఇనుపపిడికిలి తాము కోటినచో గొంచెము సందు చేయును గదా! అట్లే జరిగినది. ప్రజల శాంతి, భద్రత, ఆరోగ్యము, విద్యలకు ధర్మకర్తలగు పాలకులు వాని నొసగలేని పరిస్థితులెట్లో, దేనికో కల్పింపబడినవికదా! ఇంక క్రైస్తవమతస్వాములక్కడకూడ వచ్చును సూర్యకాంతిపై నీలితెఱలు దించిరికదా యింక తమ కాగడాల నెత్తి వచ్చును. పూర్వ సంస్కృతికి గోరీకట్టిరికదా యింక దాని

నెక్కి యీ రంగస్థలముపై తమ బొమ్మలాట లాడవచ్చును.

దేవాలయములకు, విద్యాలయములకు ప్రభు సహాయములాపబడినవి. చర్చిలకు, క్రొత్తరకపు బడులకు ప్రోత్సాహ మొసగబడినది. మిషన్ వైద్యాలయములకు దోహదము, నాయుర్వేదమునకు నిరుత్సాహము గల్పింపబడినవి. ముఖ్యముగా మొదటినుండియు సంస్కృతియే చోరని క్రీడలలో వానికి శంఖుస్థాపనలు జరుపబడినవి. బ్రతుకులో శాంతిలేని వానికి క్రీస్తులో శాంతి, దేశములో భద్రతలేని వారికి తమ తండ్రిరాజ్యములో భద్రత దొరకునని యెండమావులు జూపబడసాగెను.

* * * * * * *

డబ్లిన్ అటర్నీ పుత్రుడగు ఎడ్మండుబర్కు 1756లో నే లండను జేరెను. "పవిత్రము—సౌందర్యము" అను గ్రంథము ప్రకటించి, జాతికి హృదయమున్ను, ఆత్మనస్తున్ను జూపించెను. ఆ మహాపురుషుని కనులముందే ప్లాసీయుద్ధము జరిగినది. ప్రాగ్భారత రంగమున సూరజు, జాఫరు, కాసిం, తిరిగి జాఫరు నవాబుల బొమ్మ లెక్కినవి, దిగినవి. భారతీయ ప్రజాదృష్టినవరోధించుచు నంధావనిక పడినది. పాదుషాకు విలాస, వినోద విషములు దలకెక్కి సైతాను ఆత్మనావరించెను. మూగ కాపరులకు బంధములు, ప్రజలకు, ముకుద్రాళ్లు బడినవి. జాతీయులు ప్రభు హృదయమునకు దూరులై, సైతాను చడావులు నాకుచున్నారు.

క్లైవు తరువాత (1760—65) లో నున్న వాన్సిటార్టు, స్పెన్సరుల కాలములో జరిగిన దొంగలదోపిడీ నరికట్టించవలె

నని, తిఱిగి క్లైవును బంపిరి. అతని రెండవ పరిపాలన (1765–67) లో జఱిగిన బందిపోట్లు అసలా సైతాను చేష్ట లన్నిటికి నతడే గురువనియు, జనకుడనియు దేలిపోయినది.

ఆయన మొదటనున్న మూడేళ్ళలో నాటిన విష వృక్షము తరువాత నై దేళ్ళలో బిలకలువేసి, యంట్లుద్రొక్కు కొని, వనమైనది. ఆయన రెండవసారియున్న రెండేండ్లలో నావనములసంఖ్యయే పెఱుగసాగినది. సైతాను దయవలన నాటిననాటినుండి నాటివఱకు వఱహాలే ఫలించుచున్నవి. దులుపుకొన్నవారికి దులుపుకొన్నంత మహాప్రభూ... ...

వరట్సు, కార్టియరుల కాలములో దెల్లవాడైనచాలు, నందు నాంగ్లేయుడైన మఱియు! వరహాల వనములు బిలిచి, రమ్మని, యొడులనిండ వరహాలు వర్షించి, మోసికొనిపోలేని వారి కింటిదాక తమగాడిదలపైననే తోలిపెట్టెడివి. నందన వనములో, కల్పవనములో, ఏమో!

* * * *

క్లైవు ధర్మనూాయని... పాఱలం చక్రవర్తి ప్రజల కర్మమాయని బెంగాలు, బీహారు, ఒడిసా రాష్ట్రములకు ద్వంద్వప్రభుత్వమేర్పడినది. నిర్వహించలేని రాజ్య బాధ్య తలు నవాబువంతు! అనుభవించదగిన యధికారానుభవ ములు కంపెనీ-మానిసులపాలు!

కొన్ని కొన్ని చోటులలో శాంతి భద్రత కుదిరినవి. అవియు స్మశానపుశాంతి! కారాగారపు భద్రత! డొక్కలే యాహారముగా, దిక్కులే యంబరముగా దృష్టిపడుట కల

వడలేనివారికి అభిమానము జంపుకొనవలెనుగాని, కావలసినంత మోచేతి తీర్థము, మూఁగాలియుడుపు!

కీడుజేయుపనులు రాజులచేతను, దేశీయాధికారుల చేతను, జేయించి, తామువానిని సరిచేసినట్లుచేసి, రక్షకులనిపించుకొనికూడ కొన్నిచోట్ల తేలికరకపు కీర్తిగడించిరి.

బర్కు పార్లమెంటులో బ్రిటిష్‌జాతి అంతరాత్మను పొడిచిన పోటుకు కంపెనీ యుద్యోగి గ్రాస్వను మాఱిమొకటి జతచేసెను. ఛాదం రెండవసారి ప్రధానియైనప్పుడు భారత దేశములో దమకు గలుగుచున్న దుర్వ్యయము సంగతిజూచుట యొక పనిగా బెట్టుకొనెను. ఈస్టిండియా కంపెనీవారు ఇండియాలో చేయు వ్యవహారముల మంచి చెడ్డలనుగూర్చి విచారించుటకై యొక యుపసంఘమును ఏర్పరచవలయునని ఆల్డరుమెను బెక్ఫర్డు చేసిన ప్రతిపాదన 129 : 76 వోట్లతో నెగ్గుటనుబట్టి యానాడు బ్రిటిష్‌జాతిలోనున్న నీతి, యవినీతుల హెచ్చుతగ్గులు దెలిసికొనవచ్చును.

1756–66 సంవత్సరముల కంపెనీడైరక్టర్లను, లెక్కలను దెప్పించిరి. కంపెనీకు వచ్చులాభమునంతను ప్రభుత్వముగాజేయుట కాయెత్తని కొందఱు కంపెనీవ్యక్తులలజడి జేసిరి.

1767 లో కంపెనీవారు 12½ శాతముగాని కనీసము 4 లక్షల నవరసులుగాని లాభములు బంచుకొననిండని ప్రాధేయపడిరి. 10 శాతముగూడ తమకు చాలదని గోల జేసిరి. స్వార్జితములకు ఆస్తులకు సంబంధించిన పౌరస్వత్వము

లకు భంగము గలుగుచున్నదని మొత్తుకొనిరి. కాని కంపెనీ 10 శాతము లాభము దీసికొని, సంవత్సరమునకు 4 లక్షల నవరసులు బ్రిటిష్ ప్రభుత్వమునకు గప్పము గట్టుటకు దీర్మానమయ్యెను. అందులకు సమ్మతించనిచో దిరిగి తమకు ప్రాగ్భారలి వర్తకమునకు సర్వస్వామ్యములు సంక లితము గావని సంఘమువారు నొప్పుకొనిరి. దోపిడిలో ప్రభు త్వమునకు బాలిచ్చు నిబంధనపై దఱిగి దోచుకొనుటకు సంఘమునకు లైసెన్సు దొఱకినది.

ఇన్ని దినములు జరిగిన దోపిడీ అనధికారము. ఇంక జఱుగబోవునది సాధికారముగా గలదు. వాటా పెట్టవలసి నప్పుడు దోపిడీ లికపెద్దయెత్తున జఱుగగలదు.

ఛాదము ప్రభువు తానుండియు నేమియు నాపలేక పోయినందుల కంతరాత్మ క్షోభిల్లి బైట మొగము జూపలేక పోయెను. తన జాతిని జూచుకొని సిగ్గుపడిపోయెను. అట్టి జాతికి నాయకుడననిపించుకొనలేక వుద్యోగ విరమణచేసెను.

1769 లో నార్తుప్రభువు నాయకుడు. బర్కుప్రభు విప్పుడు వాండోవారు నియోజకవర్గమునకు బ్రతినిధిగా లోక సభలో నాసీనుడు.

'కంపెనీ యాదాయమును, లాభమును గణించక సంవత్సరమునకు 4 లక్షల నవరసులిమ్మని బలవంత బెట్టినచో వారు దానికై యమాయకులగు భారతీయప్రజల నేడ్పింతురు. పాలుకి చెల్లించుట తప్పనిసరియైనచో పీటరును చెల్లించ వలెనుగదా. వర్తకులు దమ వ్యయములన్నిటిని బ్రజలపై

రుద్దుదురుకాని తమ లాభమునుండి తగ్గించుకొందురా ?'
యని బర్కు వాదము.

కాని ప్రజలు కంపెనినుండి లంచముమేసి, యిట్లు పలుకుచుండెనని యనుకొనసాగిరి. నిజముగా నిండియాలో నేమి జరుగగలదో బర్కువలె దివ్యదృష్టి దెలుసుకోగలశక్తి సామాన్యులకుండదు. ఆ విషయమును రిచ్మండుప్రభువు బర్కు కందించినప్పుడు బర్కు చాల బాధపడిపోయెను. తనజాతి యంతరంగమదికదాయని సిగ్గిలెను. ఛాదము ప్రభువెందులకై రాజీనామా నిచ్చెనో తెలిసినది.

క్రూరుడగు సీజర్ చక్రవర్తిక్రింద ఇజ్రాయేలు ప్రజలు రోదించిన రోదనము దెలిసిన బర్కు ఇండియాలో బరిస్థితి నూహించుకొన గలిగెను.

1768-70 లో దైవిక, రాజిక కారణములు రెండును గలిగి, అతివృష్టి, అనావృష్టి, చీడ... అన్నియు సంభవించెను. కఱవు, గాటకము గలిగెను. దొరలు పన్నులు సేకరించుట మానలేదు. సేనలకై నిలువజేయుట సాగించిరి పండని చోట తఱుగును బూడ్చుటకై పండినచోట శిస్తులు బెంచిరి. గ్రామములపై సాముదాయిక శిస్తులు (నజరానాలు) విధించిరి. పూర్ణియా,నడియా, రాజషాహి, బిషన్పూరుబీర్భూము, మొదలగు ప్రదేశములు ఘూర్ణిల్లి పోయినవి. కోటికిపైగా ఆకలిచావులు గలిగెను. గ్రామములు నిర్జనారణ్యములైనవి, విషజ్వరములు, అంటువ్యాధులు వ్యాపించినవి. జనులు గొందఱు పరరాష్ట్రములకు వెళ్ళిరి. పశువుల గొనువారు లేక పీకు

కొని తినినవారు గొందఱు, విత్తనములు నమలినవారు గొందఱు, పసిపిల్లల నమ్ముకొని తినినవారు గొందఱు, తిన్నవారి డొక్కల జీల్చుకొని, యామిషముతో గలిసినను గక్కురితి పడినవారు గొందఱు, శవముల బీకుకొని తినినవారుగొందఱు నుండిరని షోరు వ్రాసెను. కాటికాపరులకు విసుగు, నక్కలకు, గ్రద్దలకు వెక్కసము నయ్యెను.

బర్కువంటివారు పొడిచినప్పుడు చెప్పుకొనుటకని, కష్టముపై మొత్తము 4 వేల నవరసులు ధర్మకార్యములకై కంపెనీవారు మంజూరుచేసిరి. ఆధనముతో గొన్న ధాన్యములో గొంత కనుమాటు గావించి, దొంగలెక్కలువ్రాసి. దొంగయంగడిలో నమ్ముకొని, మూటలుగట్టిన దొరలు కూడ కలరని ఋజువైనది.

ప్రజల యన్నార్తిని గని కన్నీరు వెట్టినన్ని పాపము నడియారాజు రాజ్యము లాగికొనిరి. రాజషాహి రాణిని బెదరించిరి. పసివాడగు బీర్భూముఱురాజును జైలులోనుంచిరి.

చిత్రము! వ్యవసాయదారులు భూములు వదలుకొని పోవుచుండగా ప్రక్కరాష్ట్రములనుండియు, అదియేమి, యిది యేమియని తమసీమనుండియు, రైతులను దిగుమతిజేసికొనసాగిరి.

క్షాటకము తీఱిన 15 సంవత్సరముల వఱకు కూడ (1789) కంపెనీవారి స్వంతభూములలో వన్యమృగములే కాపురములు సేసెడివి.

* * * * * * *

ఈ వివరము లన్నియు నింగ్లండు జేరెను. ఉదార పురుషుండు షోరు తాకన్నార జూచిన దృశ్యముల యక్షర చిత్రములను జూచి, గుండె లవిసిన బర్కు ప్రభువు "చూచితిరా, నేనప్పుడే యూహించి. చిత్రించిన దానికి నాకు దివ్యదృష్టి యున్నదా? జ్యోతిషము దెలియునా యంటిరి!" అని మఱియొక్కమాఱు పార్లమెంటు సభ్యుల యందఱి గుండెలను వరుసగా బాది, వాయించి, వదలెను. ఆ ప్రమోతతో నాంగ్లజాతి యంతరాత్మ యింకొకసారి మేల్కాంచినది. అప్పుడేర్పడిన విచారణసంఘముల యెదుట బోవువడిన సాక్ష్యమును నవలగా జేసినచో నది యొక ద్రౌపదీ వస్త్రాపహరణమంతకాగలదు. దుర్యోధన దుశ్శాసనులబోలిన క్లైవు వాన్సిటార్టుల ప్రతాపముల విగిన లోకసభ పెద్దలు పాండవులవలె సహించి, భరించలేదు. విక్షుభితులై లేచి వారిని బహిరంగముగా నిలబెట్టి, ఖండించవలసిన చేసినిరి.

బర్కు ప్రభువు ప్రతిసభ్యుని గుండెనుఎక్కి, కూఱుచుండినట్లుండినది. ద్రౌపది పాలిట శ్రీకృష్ణ పరమాత్మను మించి అతడు భారతప్రజల పక్షమును సమర్థించెను.

క్లైవును అసూర్యాస్తమిత సామ్రాజ్య సంస్థాపకాచార్య బిరుదముతో బొగడిన నోళ్ళింగ్లండనే నాడట్లు పరాభవించినందుల కతని దుర్యోధన మహాభిమానము మొక్కవోయి నట్లనిపించినది. అతనిని మెచ్చుకొని, సన్మానాలంకృతుని జేసి కరతాళధ్వనులు జేసిననాడే తన్ను ఖండింతు మన్నందుల కతడు గుమిలికుమిలి పోవు సుయోధనుడు ప్రాద

మునచూగినట్లు స్వగృహమునందే యణగియుండెను. తలుపులు వేసికొని కూర్చుండెను. పార్లమెంటులోనాటితిట్లు, నిందలు, శాపనార్థములు వినకై చెవులు మూసికొనెను. సిగరెట్లు తీసి పీల్చగా, పొగవెంట నేవో తేళ్లు, జెఱ్ఱులు లో జొఱెనట్లు తోచెను. ఎఱ్ఱని ద్రాక్షపానీయము గోచరించినది. మన శ్శాంతికై యిసుమంత గ్లాసులో బోసికొనెను. అది సూరజు ద్దౌలా రక్తముగా దోచెను. అందులో అతని తల వికార ముగా నవ్వుచు నీడుచున్నట్లు దోచెను.

మనస్సు స్థిరము జేసికొని, యొక్క గ్రుక్క దీసికొనెను. కనులు [illegible] పడెను. కాని ఇండియాలో దా దోచిన ధనము, కొట్టిన యూభరణములు, తీసిన దొంగవర్త కపు లాభములు, చేయించిన హత్యలు మాఱ్చిన తలలు, అలరించిన నాశములు నన్నియు గొన్ని పాములుగా, కొన్ని పులులుగా, కొన్ని శూలములుగా, కొన్ని ఫిరంగులుగా, చుట్టు ముసిరెను.

ఆదినము భోజనము నొద్ద కూర్చుండగా నది పురు వులు పట్టిన నరమాంసమువలె గోచరించెను. అతని బ్రతుకే యతనికి దుర్భరముగా దోచెను. తన చేతితోడనే తన పిస్తోలులో గుండ్లు పూన్చుకొనినట్లున్నాడు.

* * * * * * *

ఆ మఱునాడు క్లైవు ఆత్మహత్య గావించుకొనెనను దుర్వార్త దేశమును దద్దరిలజేసెను. ఆవార్త బర్కుపక్షము వారికి మఱింతబలము జేకూర్చెను. పార్లమెంటు వా రా

యూరప్పులో నెంతటి ప్రబల చర్యయో తీసికొనెడువారే, కాని ప్రాగ్భారత వర్తకసంఘమువారే యొక మూర్తిత్రయ విచారణ సంఘము నేర్పఱచి, దాని నిండియాకు పంపి, ఇవే దికను సిద్ధపఱపించుచున్నామనియు, దాని సలహాలననుసరించి యంతయు సంస్కరించగలమనియు, నాగవలసినదనియు! దాని యధ్యక్షునుగా బర్కు ప్రభువునే ప్రార్థించదలచితి మనియు జెప్పుకొనిరి.

నాటి పార్లమెంటు ప్రతిపక్షనాయకుడగు రాకింగు హాము ప్రభువు తన యాంతరంగిక కార్యదర్శికాగల బర్కు ప్రభువును మాత్రము ఆ సంఘముతో సంబంధము బెట్టుకొన వద్దనెను బర్కు ప్రభువు బంధువులుకూడ చాలమంది యా యాలోచననే బలపఱచిరి. కంపెనీ యుపాధ్యక్షుడగు సర్ జార్జి కోల్బ్రూకు, వారు ఎందఱో ఎంతయో ప్రయత్నించిరి. కాని ఇండియా, ఇంగ్లండుల సంబంధములయొక్క భవిష్యత్ తీరు వేరు గావలసియుండెను — ఆయన యా ప్రమేయమును మానుకొనెను:

తుదకు కమిషన్ అధ్యక్షుడుగా నియమింపబడి క్లైవు తరువాత బెంగాలు గవర్నరుగా, ఇండియా మొదటిగవర్నరు జనరలుగా బరిణమించిన వారన్ హేస్టింగ్సు మనకు చిరపరి చితుడే; క్లైవు సహాధ్యాయి, అనుయాయి!

శ్రీ సారథి ఆర్టు ప్రెస్, తెనాలి.